




త్వరలో వస్తున్నది!
వాహినీ వారి
గుణసుందరి
కథ...
సుబ్బారావు.. శివరావు
రేలంగి...సుబ్బారావు..
శాంతకుమారి.. మాలతి..
శ్రీరంజని...హేమలత..
కనకం...లక్ష్మీరాజ్యం
అపూర్వ జానపద చిత్రం...
డైరెక్టర్... కె.వి.రెడ్డి, B.Sc (HONS
నిర్మాణము... వాహినీ స్టూడియోస్

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరం, చిక్కుబొమ్మలు ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.



సందైనవి
ష్టికరమైనవి
సావరిన్ స్వీట్స్‌లో చిగలవి

ముఖ్యమైన మూడు లక్షణాలున్నవి. (1) మధురమైన రుచి. (2) పుష్టినివ్వటంలో మంచివి. (3) పరిశుభ్రతలో లోపంలేదు. సావరిన్ స్వీట్స్ అనే పేరు జ్ఞాపకం ఉంచుకోనండి.



# సావరిన్ స్వీట్స్

ది కె. పి. పి. కన్ఫెక్షనరీ (మద్రాసు) లిమిటెడ్,
మద్రాసు - 24.

---

## 'చందమామ' కు
## ఏజంట్లు కావాలి

●

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**
పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.

---



# డోంగ్రేగారి
## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్నూ, వండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY - 4

దిగ్విజయముగా నడచుచున్నది.

ప్రేక్షకుల అభిమాన చిత్రము.

స్వస్తిక్ వారి,

# ధర్మాంగద

కృష్ణవేణి...బూపేంద్రమణి...డా. సుబ్బారావు...రాళ్ళబండి...లింగమూర్తి

డైరెక్షన్. H.V. బాబు.



# అట్టమీది బొమ్మ

కిందటిసారి, ధేనుకాసురుడనే రాక్షసుణ్ణిగురించి చెప్పాము. ధేనుకాసురుడూ, వాని బంధువర్గమూ నాశనమైపోయినప్పటికీ, ఇంకా ఎంతో మంది రాక్షసులు జీవించేవున్నారు. వాళ్ళందరూ శ్రీకృష్ణ, బలరాములమీదికి ఎప్పుడువెళ్లుదామా అని, సమయంకోసం నిరీక్షిస్తూవున్నారు.

శ్రీకృష్ణుడు చంపినవాళ్ళలో ధేనుకాసురునితరువాత, అఘాసురుడు చెప్పుకో తగ్గవాడు. అఘాసురునికి మేనమామ ఒకడున్నాడు. వానిపేరు అరిష్టాసురుడు. "అరే, చూడబోతే నా వేలంత లేడు. ఈ కృష్ణుడు నామేనల్లుని చంపుతాడా? వీనిపని పడతానుండు" అంటూ, అరిష్టాసురుడు శ్రీకృష్ణునిమీద కసిపూనాడు.

కసిపూనిన అరిష్టాసురుడు, ఒక ఆబోతురూపం ధరించి, వాయువేగంతో కృష్ణునిమీదికి భయంకరంగా తలపడ్డాడు. అపురూపమైన ఆ ఆంబోతు అకస్మికంగా వచ్చేవరకు, ఎక్కడి గోవులు అక్కడనే పరుగుచ్చుకొని ప్రాణం దక్కించుకోబోయినయి. గోపులందరూ కంగారెత్తి కాలికి బుద్ధిచెప్పారు. గోపికలు నిస్సహాయస్థితిలో "కృష్ణా! ఆపదోద్ధారకా!! రక్షించు, రక్షించు!!" అంటూ చేతులెత్తి మ్రొక్కారు.

అప్పుడు అవతారమూర్తి శ్రీకృష్ణుడు, ఆబోతుయొక్క వాడికొమ్ములు రెండి టినీ తన రెండుచేతులతోను పట్టి, తమలపాకుతొడిమ తీసివేసినట్టుగా, దాని కుడికొమ్మును పళక్కన విరిచివేసేవరకు, నెత్తురు వరదలుగా ప్రవహించింది.

ఆ విరిచిన కుడికొమ్ముతోనే శ్రీ కృష్ణుడు అరిష్టాసురుణ్ణి చితుకగొట్టి పొడిచే సరికి, ఆ బాధకు తాళలేక, మరికొంచెముసేపటికే గిలగిల తన్నుకొంటూ రాక్షసుడు ప్రాణాలు విడిచాడు. దుష్టసంహారంకోసం జన్మించిన శ్రీకృష్ణుని చేతులో ఈ విధంగా అరిష్టాసురుడుకూడా మృతిపొందాడు.




సంపుటి 5
సంచిక 5

సంచాలకుడు: చక్రపాణి

నవంబరు
1949

# దీపావళి

ఆశ్వయుజమాసపు శుక్లపక్షంలో దసరావచ్చిందికదూ! అదే మాసంలో బహుళ పక్షంలో వచ్చే మరొక గొప్పపండుగ దీపావళి. ఇది హిందువులందరకూ అప్యాయనమైంది. ఇది గొప్పపర్వం గనుకనే మార్వాడీవర్తకులు దీపావళినాడు ధనలక్ష్మిని పూజచేసి, కొత్తలెక్కలు ప్రారంభిస్తారు. ఆనాడు ఇంటింటా బారులు తీర్చిన దీపాలవరుసలు కలకల్లాడుతూ వెలుగుతాయి. పాపాయిలు సాయంత్రం దివిటీకొట్టి, రాత్రల్లా రకరకాల బాణాసంచాలు వేడుకగా వెలిగిస్తారు. అలా వెలిగించటంచేత ఆ రసవిషగంధకాల పొగవల్ల ఈ ఋతువులో అమితంగా బయల్దేరే దుష్టక్రిములు నాశనమవుతాయని శాస్త్రజ్ఞులు అంటారు. కనుక, ఇది ఒక లాభం. అదీగాక, బాణాసంచా తమంతట తాము కాల్చటంవల్ల పిల్లలకు పిరికితనం పోయి, పౌరుషమూ, ఉత్సాహమూ పుట్టుకొస్తాయి.



# పక్కా ఫకీరు

ఒంటెల దోలుకు పోయే వా రొక
కుంట గట్టుపై జేరారు.
కుంటి యొంటె గనుపడలేదంటూ
గ్రుద్దు లాడుకో సాగారు.

ఆ సమయానికె పకీరువా డొక
డటకె వచ్చి కూర్చున్నాడు.
ఆ యయ్యలు 'మా యొంటె గన్పడిన
దా ?" యని పకీరు నడిగారు.

"కుంటికాలిదేనా ?" యని సాహే
బంటే వా "రవు" నన్నారు.
"ముందరి పండ్లూడినదేనా ?" యన
అంద "ఇదే ను"మ్మన్నారు.

"బియ్యము మోసేదేనా ?" యన నా
యయ్యలు చంకలు గొట్టారు
"ఏదేదీ యెటు పోయిం ?" దంటూ
ఎగబడి పకీరు నడిగారు.

"ఒంటె స్వరూపము మాత్ర మ్మాతడు
కంట జూడలే" దన్నాడు.
"నిజము చెప్పు" మని బతిమలాడినా
"నే నెఱుగను పొం" డన్నాడు.

వీరు నల్వు రా పకీరువాణ్ణొక
పెద్దమనిషికడ జేర్చారు.

రచన :

"ఏటుకూరి"

పెద్దమనిషి "నిజమాడుము లేదా
గుద్దులు పడతై" యన్నాడు.
పకీరు దండముపెడుతూ "సత్యము
బాబయ్యా! విను" మన్నాడు.

"చెలిక బురదలో నొంటె కాలి జా
డలు మూడే గనిపించినవి
అందుచేత నది తప్పక కుంటిది
యై యుంటుందనుకొన్నాను.

గరిక మేయునపు డిరుప్రక్కలః దెగి
సరిగ మధ్య దెగకుండుటచే
పైవో క్రిందవొ తప్పక ముందరి
పండ్లూడిన వనుకొన్నాను.

చిత్తు బెత్తుగా జారిన ఓయ్యము
చీమలు కరచుక పోతుంటే
మస్తుగ వీపున బియ్యపు నూకల
బస్తా లెత్తారనుకొన్నా."

అంటుండగనే వెలవెల బొయ్యా
రయ్యలు మియ్యలు గూడాను.
రావోయ్ పోవో యంటూ ఎవ్వరి
త్రోవను వారలు పొయ్యారు.










పూర్వం ఇంద్రద్యుమ్నుడనే మహారాజు కళింగ దేశాన్ని పరిపాలిస్తూఉండేవాడు. ఆయనకు ఒకనాడు సముద్రంమీద ఓడ ప్రయాణం చెయ్యాలని సరదాపుట్టింది. రాజు తలచుకొంటే కొదువేమిటి? వెంటనే హంసరూపంలో ఒక అందమైన ఓడ తయారయింది. మంత్రులు, మహారాజావారు, మహారాణీ, పరివారమూ, అందరూ ఓడఎక్కి బయలుదేరారు. తెరచాపలు గాలి పోసుకున్నై. ఓడ 'రంయ్' మంటూ జోరుగా సాగిపోయింది.

ఏముహూర్తాన వారు బయల్దేరారో కాని, తీరా ఓడ నడిసముద్రంలోకి వెళ్ళగానే పెద్ద తుపాను చెలరేగింది. ఆ గాలిదెబ్బకి ఓడకొయ్యలు విరిగిపోయాయి. తెరచాపలు చినిగిపోయాయి. ఓడ అటూ ఇటూ ఒరగడం మొదలెట్టింది. ఏక్షణాన ఓడ మునిగిపోతుందో అని భయంతో అంతా గొల్లుమంటూ ఏడవటం మొదలెట్టేరు. సరంగులు ఓడనెల్లాగైనా ఒడ్డుకు చేరుద్దామని తాపత్రయపడ్డారు గాని లాభం లేకపోయింది.

ఉన్నట్టే ఉండి, ఒక్క పెనుగాలి తాకటంవల్ల ఆ ఓడ ఒక కొండకు కొట్టుకొని, స్వరూపం లేకుండా పోయింది.

ఓడ ఎక్కిన పరివారంలో ఒక్కళ్ళూ అనవాలుకైనా దొరకలేదు. ఇంద్రద్యుమ్న మహారాజు మటుకి ఒక దుంగ కొస పట్టుకుని, దానితోపాటు తేలుతూ మునుగుతూ కనపడ్డాడు. ఇంకా నిదానించి చూడగా ఆ దుంగ రెండవకొసను మరెవరో తనకు మల్లేనే పట్టుకునిఉన్నట్టు కనపడింది. "ఎవరు వారు?" అని అడిగేడు రాజు. "నేను రాణీని" అని బదులు వచ్చింది. మహారాణీ కూడా బ్రతికిఉన్నందుకు రాజు సంతోషించాడు. కాని, మరుక్షణంలోనే, "ఈ దుంగని పట్టుకుని సముద్రంలో ఎంత కాలం బ్రతకగలం?" అనిపించింది రాజుకి. ఐనా మహారాణీతో, "పట్టుమాత్రం

పి. బాలకృష్ణ, త్యాగరాయనగర్

వదలకు. అయువు ఉంటే మనల్ని బ్రతి కించడానికి ఈ దుంగే చాలు" అన్నాడు. రాజు అన్నట్టే చివరకు ఆ దుంగే వారిద్ద రినీ బ్రతికించింది. ఓ పెద్ద కెరటం వచ్చి, ఆ దుంగ కొట్టుకుపోవటంతో రాజూ, రాణీ క్షేమంగా ఒడ్డుకు చేరుకున్నారు.

మరొకళ్ళయితే "ఈదుంగ పని మనకి ఇంక ఏముంది?" అని దానిని అక్కడనే వదిలేసి తమ దారిని తాము పోయేవారు. కాని ఆ రాజదంపతులు అలా పోలేదు. తాము నీటిలో మునిగిపోతూంటే ఆ దుంగ దేవునిలా ప్రత్యక్షమై గండాన్ని తప్పించిం దని చెప్పి, ఇద్దరూ దానికి సాష్టాంగ నమ స్కారంచేశారు. అప్పుడు రాజు మహారాణితో "మనకు ప్రాణదానం చేసిన ఈ మాను సామాన్యమైనది కాదు. కనుక దీనితో దేవతా విగ్రహాలు చెక్కించి, చక్కని ఒక గుడి కట్టించి, ఆ గుడిలో ఈ విగ్రహాలు ప్రతిష్ఠ చేద్దామని ఉంది. ఏమంటావ్?" అని అన్నాడు. "ఓహోహో, దివ్యమైన ఆలోచన తోచింది మహారాజా! తప్పకుండా మీ ఆలోచనప్రకారం చేసి, ఈ ద్రూనుకు మన కృతజ్ఞత కనపరుచుకుందాం" అన్నది రాణీ.



రాజూ, రాణీ ఆ దుంగను పట్టించుకుని పట్టణం చేరుకున్నారు. ఈ సంగతి తెలిసి దేశంలో ఎక్కడెక్కడి శిల్పులూ బయల్దేరి చక్కావచ్చి. 'విగ్రహాలు మేము చెక్కుతాం' అంటే 'మేము చెక్కుతామ'ని అన్నారు రాజుగారితో. "ఇంతమంది శిల్పులొచ్చారే. వీళ్ళల్లో ఎవరికిద్దాం ఈపని?" అని ఇంద్ర ద్యుమ్న మహారాజు ఆలోచిస్తూ వుండగా చిన్న కునుకుపట్టి ఆ కునుకులో ఒక కల వచ్చింది. ఆ కలలో రాజుకి దేవుడుకనపడి "ఆ ద్రూనును దేవతా విగ్రహాలుగా చెక్కటానికి ఈ వచ్చిన శిల్పులు ఎవరూ తగరు. రేపు నీ సభకు ఒక శిల్పిని పంపు




తాను. అతనిచేత విగ్రహాలు చేయించు" అని చెప్పి అంతర్ధాన మైపోయాడు.

ఆ ప్రకారమే మర్నాడు రాజసభకి ఒక ముసిలివాడు వచ్చి, "నేను ఒక శిల్పిని. మీరు కోరిన విగ్రహాలు నేను చెక్కి పెట్ట గలను" అన్నాడు. "కూచునిలేవలేని ఈ ముసిలివాడు విగ్రహాలు చెక్కే దేమిటి, వీడి మొహం?" అని తక్కిన శిల్పులంతా గేలిచేశారు. కాని రాజుకి తెలుసుగా అసలు రహస్యం? కనుక ఆయన ఈ పనిని ఆ ముసలివానికె వప్పగించాడు.

తక్కిన శిల్పులందరూ చేసేదిలేక మనసులో తిట్టుకుంటూ ఎవరి దారిన వాళ్లు పోయారు. కాని. "ఈ వృద్ధుడు నావల్ల కాదు అని కాళ్లు సాచేస్తాడు. అప్పుడు రాజుగారు మనకెలాగా కబురు చేస్తారు కదా" అని కొందరు శిల్పులు ఆశపెట్టుకొని కూచున్నారు.

ఆ ముసిలివాడు రాజుతో ఒక కచ్చితమైన నిర్ణయం చేసుకున్నాడు: "ఈ విగ్రహాలను నేను చెక్కుతూఉన్నంతకాలం నావద్దకు ఎవరూ రాకూడదు. ఒక గదిలో కూచుని తలుపులు మూసివేసుకుని, విగ్రహాలు చెక్కుతాను. చెక్కడం అవడం తోనే తలుపులు తీసుకుని నా అంతట నేనే బయటకు వస్తాను. ఈలోగా ఎవరూ నన్ను పలకరించనైనా పలకరించకూడదు" అని. "అలాగే" అని వప్పుకున్నాడు రాజు. "విగ్రహాలు ఇంత రహస్యంగా చెక్కడం ఎందుకో? ఇంతోటి పనివానితనానికి దిష్టి తగులుతుంది కాబోసు!" అని వేళాకోళం చేశారు అక్కడి శిల్పులు.

ముసిలివాడు ఆ మ్రాను పుచ్చుకుని తనకు చూపించిన గదిలోకి వెళ్ళి కూచుని తలుపులు వేసుకున్నాడు. భోజనానికైనా బయటికి రాలేదు. "వీడు ఏం చేస్తున్నాడు చెప్మా?" అని తక్కిన శిల్పులు గది



గుమ్మం వద్దకు వెళ్ళి చెవులొగ్గి విన్నారు. ఎక్కడా ఉలి చప్పుడుగాని, బాడిత అలికిడి గాని వినపడనేలేదు. నిశ్శబ్దంగా ఉంది. అప్పుడు వాళ్ళు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, ఆ ముసిలివాడు ఏలికను మోసం చేశాడు. అర్ధరాత్రివేళ ఎప్పుడో విలువైన ఆ ద్రవ్యాన్ని పుచ్చుకుని పారిపోయి వుంటాడు. లేకపోతే ఆ గదిలో మనిషిజాడ అయినా లేకపోవడ మేమిటి?" అన్నారు. ముసలిశిల్పిమీద పూర్తిఐన నమ్మకంగల రాజు వాళ్ళను కోపపడి పొమ్మన్నాడు.

మరికొంతకాలం గడిచింది. ముసలి శిల్పి గదితలుపు లింకా తెరవనేలేదు. ఈ అదనుచూచి, అసూయతోవున్న తక్కిన శిల్పులు మళ్ళీ రాజువద్దకుపోయి "దేవరా! ముసలివాడు ఉండే గదిలో ఉలుకూ పలుకూ లేదు. ఈపాటికి వాడు చచ్చిపోయి వుండాలి" అంటూ నమ్మతగినట్టుగా వాదులు చెప్ప నారంభించారు. చెప్పుడు మాటలు చెడ్డవికదా! రాజుకి ఊపిరాడ నీయకుండా ఇలా నూరిపోయటంవల్ల, ఆయనకుకూడా మనసు చెదిరిపోయింది. వెంటనే ముసలివాడు ఉండే గదికి వెళ్ళి, శిల్పినిపిలిచాడు రాజు. సమాధానం రాలేదు సరిగదా, లోపల మనిషి ఉన్న అలికిడే వినపడలేదు. రాజు ఉండబట్టలేక, బలవంతంగా తలుపులు తెరిపించాడు. లోపల శిల్పి లేడు! ద్రవ్యమూ లేదు! కాని దివ్యసుందర విగ్రహాలు రెండున్నాయి-దేవుడూ, దేవేరినీ! ఎంత అందమైనవి! "ఈ విగ్రహాలు రెంటికీకూడా పాదాలులేవే? పానాలే కాదు, హస్తాలూ లేవే! ఏమిటీ మొండి విగ్రహాలు!" అని ఆయన ఆశ్చర్యపోయాడు.

ఆ విగ్రహాలలో దేముడుబొమ్మ, ప్రాణమున్న మనిషికిమల్లే మాట్లాడటం మొదలెట్టింది: "ఇంద్రద్యుమ్నా, తొందరపడి తలుపుతెరిచావు? ఇంక కొద్దిరోజులు

ఓపిక పట్టి ఉంటే మాకు హస్తాలూ, పాదాలూకూడా అమరివుండవి. నీ తొందర పాటువల్ల మేము మొండివాళ్ళం అయి పోయాం" అంది ఆ బొమ్మ.

అప్పుడు ఇంద్రద్యుమ్నుడు సాష్టాంగ పడి, "స్వామీ, క్షమించండి. ఆ ముసలి శిల్పి ప్రాణాలు వదిలేశాడేమో అని భ్రమ పడి తలుపులు తీయించాను. అంతకంటె వేరు ఆలోచన లేదు. ఏడి, ఆ ముసలిశిల్పి ఏడి?" అంటూ ఆత్రంతో అడిగేడు.

"నేనే ఆశిల్పిని" అంటూ ఆ ధ్వని నిలిచి పోయింది.

అప్పుడు ఇంద్రద్యుమ్న మహారాజు తన తప్పిదం తెలుసుకొని చాలా విచారించాడు. తక్షణమే, ఆయన సముద్రపు ఒడ్డున పూరీజగన్నాథములో తనకు ఎక్కడ ఈ మ్రాను దొరికిందో అక్కడ గొప్ప ఆలయం నిర్మించి, ఈ విగ్రహాలను అందులో ప్రతిష్ఠింపించాడు.

ఓఢ్రదేశములోని పూరీజగన్నాథము నాటినించి ఒకగొప్ప దివ్యక్షేత్రమై వెల సింది. నేటికిన్నీ లక్షలకొద్ది హిందువులు ప్రతియేటా మహిమగల మొండి జగన్నాథ స్వామిని పూజించి తరిస్తూవున్నారు.






రాజు గోల చూడలేక, ఆస్థాన వైద్యుడు మళ్లీయోచించి, "మహేంద్రమణి అనిచెప్పి ఒక మణి ఉన్నది. ఎలాగైనా అది తెప్పించ గలిగితే, శస్త్ర చికిత్స అవసరం లేకుండా తప్పిపోతుంది. ఆ మణిని ఇలా తాకిస్తే చాలు, ఏ జాడ్యమైనా నయమైపోతుంది" అంటూ, సూక్ష్మమైన ప్రక్రియ చెప్పాడు.

అప్పుడు కోటలో అంజనం వేయించి చూచారు. వైద్యుడు చెప్పిన మణి మహేంద్ర పర్వతములో ఉన్నది. ఆ పర్వతానికి దండకారణ్యం చివర కాళికాలయంలోనించి ఒక సొరంగం ఉన్నది. ఆ మార్గంలో సింహ ద్వారం, మకర ద్వారం, కమల ద్వారం అని మూడు ద్వారాలు ఉన్నాయి. ప్రతి ఒక్క ద్వారాన్ని ఒక్కొక్క యక్షకన్య రక్షిస్తూ వుంటుంది. ఆ యక్షితల్ని గెలిచి, ఆ ద్వారాలు దాటి వెళ్లి, ఆ మహేంద్రమణిని తీసుకరావాలి.

ఇంతపని చేసుకురావటం దుస్సాధ్య మని తెలిసేవరకు, రాజబలగమంతా "ఈ మణిని సాధించి తేవటం మా తరంకాదు" అని చెప్పేశారు. "ఎవరివల్లా కాకపోతే, రాజ్యంలో చాటింపు వేయించండి. మహేంద్రమణి తెచ్చి, నా ప్రాణం కాపాడినవానికి నా రాజ్యం ఇచ్చివేస్తాను. ప్రాణం నిలబడితేకద, రాజ్యం ఏలేది?" అన్నాడు మహారాజు.

ఇంకేముంది?—ఆ ప్రకారం మంత్రి చాటింపు వేయించేసరికి, మణిని తీసుకు వచ్చి రాజ్యాన్ని ఎవరు కాజేసుకుపోతారో అని రూపా హేమలకు మనస్సులో కలవరం పుట్టి, తమ భర్తలే తేగలిగినట్టయితే రాజ్యం తమకే ఉండిపోతుందికద అని ఆశించారు. ఈ ఆశతో వారు హరమతికీ, కాలమతికీ కత్తులుకట్టి, మణి తీసుకువస్తే కాని గడపత్రొక్క రాదని శాసించి, పంపారు.

'నాగేంద్ర'




యక్షిత లేమిటో, ఆ ద్వారా లేమిటో ఏమైనా తెలిస్తేగా? అదేదో సులువైన పని అనుకొని, రొమ్ము విరుచుకొంటూ వాళ్లు మణికోసం బయలుదేరారు.

తండ్రికి జబ్బుగా ఉన్న సంగతి తెలియగానే గుణసుందరికి దుఃఖం పొర్లుకు వచ్చింది. ఐతే, ఎలా రక్షించుకోవటం? తన భర్త కామరూప విద్య తెలిసిన ఘటికుడు. కాబట్టి ఆయన ఒక్కడు తలుచుకుంటేనే మణి సాధించుకువచ్చి, మహారాజును రక్షించగలడు.

గుణసుందరి భర్త పాదాలపైన పడి, "మీరు సర్వ సమర్థులు, సర్వజ్ఞులు. మీ చరణదాసినైన నా ముద్దు చెల్లించి, మహేంద్రమణిని తీసుకువచ్చి, మా తండ్రిని రక్షించండి" అంటూ ప్రార్థించింది.

అప్పుడు దైవాధీనం, తను చెప్పకపోయినా తన రహస్యాన్ని గ్రహించగలిగిన భార్య తెలివికి మెచ్చి ఆనందించాడు. ఆ వెంటనే అతను వృద్ధరూపం విడిచి, ఒక సుందరమైన రాజకుమారునిగా మారిపోయాడు. మెరసిపోతున్న పతి నిజరూపం చూచి, గుణసుందరి ఉత్సాహపడి "మీ జీవితరహస్యం ఏమిటి? చెప్పండి" అని వేడింది.

అందుకు అతను, "నేనొక రాజకుమారుణ్ణి. నా పేరు వీరసేనుడు. చిన్నప్పుడే నా తలిదండ్రులు రాజ్యభ్రష్టులై, గతించారు. అప్పుడు నన్నొక తపస్వి పెంచి, సకల విద్యలూ నేర్పాడు గాని, కామరూప విద్య మాత్రం నేర్పలేదు. అందుచేత వారు నిద్రిస్తూవుండగా నేను వారి గ్రంథాన్ని సంగ్రహించి ఈ విద్య తెలుసుకొన్నాను. ఈ సంగతి తెలిసి, తపస్వి నామీద కోపించి 'ఈ నీ విద్యారహస్యం నీ భార్యకు తప్ప మరెవ్వరికి తెలిసినా నీవు ఎలుగుబంటివయిపోతావు' అని ఆయన నన్ను శపిం

చారు. కనుక జాగర్త!—నీవు ఈ రహస్యాన్ని ఎవరికైనా చెప్పితివంటే నేను ఎలుగుబంటి నైపోతాను సుమా!" అని దైవాధీనం గుణసుందరికి చెప్పి, మళ్ళీ ఎప్పటి ముసలిరూపం ధరించి, మణికోసం బయలుదేరాడు.

బయల్దేరేముందు ఒక తులసిమొక్కను భార్యకు చూపి, "ఇదుగో, ఈ మొక్క పచ్చగా ఉన్నంతకాలమూ నేను క్షేమంగా ఉన్నట్టు. అది ఎప్పుడు వాడిపోతే అప్పుడు నాకు అపాయం సంభవించిందని అనుకోవలసింది" అంటూ దైవాధీనం ఆనవాలు చెప్పాడు.

హరమతీ, కాలమతీ ఒకరోజు క్రిందటనే బయల్దేరినా, దైవాధీనం వాళ్ళకంటె చాలా ముందుగా వెళ్ళి, దారిలో వాళ్ళకి ఎదురుపడ్డాడు. ఇతనిని చూడగానే వాళ్లు "నీ బతుక్కి నువ్వూ మణి సాధించుకు రావటానికే బయల్దేరావా? నీ అవతారానికి తోడు, రాజ్యంకూడా కొట్టేదామని చూస్తున్నావా?" అని హేళన చేశారు.

అందుకు దైవాధీనం "అబ్బే, నేనేమిటి? మణిని సాధించుకు రావడమేమిటి? అక్కడి వింతలూ విశేషాలూ ఏమిటో చూచిపోదామని వచ్చాను. నన్నుకూడా



మీవెంట తీసుకు వెళ్ళండి" అని ప్రాధేయపడినట్టు నటించాడు. వాళ్ళు "సరే, మేము వాయువేగాన వెళుతూ వుంటాము. కాళ్ళీడ్చుకొంటూ నీవు మా వెనక రావలసింది" అని చెప్పి, ఉడాయించారు.

వాళ్ళ అవివేకానికి నవ్వుకొంటూ, దైవాధీనం అక్కడనే మాయమై, క్షణంలో కాళికాలయంలో వెలిశాడు. ఆలయపు గర్భగుడిలో దేవి విగ్రహానికి వెనుక ఒక కీలున్నది. అది తిప్పితే, ఆ విగ్రహం వెనక్కు తిరిగి, మహేంద్రగిరికి పోయే సొరంగద్వారం తెరుచుకుంటుంది. ఆ కీలకం తెలిసిన దైవాధీనం సౌందర్యవతి



అయిన ఒక స్త్రీ రూపం ధరించి, శృంగారంగా ఆడుతూ, పాడుతూ అక్కడ వాళ్ళ కోసం నిరీక్షిస్తూ వున్నాడు.

కొంతసేపటికి, రొప్పుతూ రోజుతూ హరమతీ, కాలమతులు అక్కడికి చేరుకొన్నారు. స్త్రీరూపంలో దైవాధీనాన్నిచూచి, ఆమె యక్షిత అయివుంటుం దనుకొని, కత్తులు దూశారు వాళ్ళు. కాని, క్షణంలో ఆమె అందానికి తన్మయులైపోయారు.

దైవాధీనం వాళ్ళను ఒక ఆట ఆడించి చివరికి గిరుకుంచిపోయి, సొరంగంలో మాయమవుతూ, వాళ్ళకు వినిపించేట్టు వికటంగా నవ్వాడు.

అది విని, హరమతీ కాలమతులు కళ్ళు తెరిచి, అయక్షిత తమను తప్పించుకపోయి వెక్కిరిస్తున్న దనుకున్నారు. దాని పని పట్టాలనే వుద్దేశంతో, అటూ యిటూ గాలిస్తూపోయి, వాళ్లుకూడా అ సొరంగంలో పడ్డారు. పడితే పడ్డారు, ఎలాగో సొరంగం కనిపించింది గనుక, వీపులు దులుపుకొని అందులో చొరబడ్డారు. వీళ్ళను చూచి దైవాధీనం, నిజరూపంలో వెలికిలా పడుకొని, గుండెమీద ఒక బండ పెట్టుకొని, అరున్నొక్కరాగం అలపించాడు. అంతలో హరమతీ కాలమతులు వానిని రక్షించగల మొనగాళ్ళమంటూ వచ్చి, గుండెపైనవున్న బండను తీసివేసి, దైవాధీనాన్ని పరామర్శించారు. అతను "యక్షిత! యక్షిత!" అని భయం నటిస్తూ మెల్లిగా లేచాడు.

"ఓస్, ఈ మాత్రానికే భయపడుతున్నావా? లే, లే. యక్షితను మటుమాయం చేసివచ్చాములే" అని అన్నా, తమ్ముడూ ఏకకంఠంతో ప్రగల్భాలు కొట్టారు. వీళ్ళ డచ్చీలకు లోలోపల నవ్వుకొని, "ఐతే పదండి!" అంటూ దైవాధీనం దారితీశాడు.

ఈ విధంగా వాళ్ళను దద్దమ్మలుగాచేసి ఆడిస్తూ, దైవాధీనం సొరంగమార్గం బట్టి వెళుతూవున్నాడు. అలా ముగ్గురూ వెళ్లగా

వెళ్ళగా, కొంతదూరంలో సింహద్వారం ఉన్న గుహ చేరుకొన్నారు. అక్కడ అంతటా పుర్రెలు, అస్తిపంజరాలు, ఏమేమో కనపడుతున్నవి. పొగలు ఎగసి వస్తున్నాయి. గోండ్రింపులు వినబడుతున్నాయి. ఇటువంటి భయంకరమైన అ ప్రదేశం మధ్యని యక్షిత వీణ వాయించుకుంటూ కూర్చునివున్నది.

ఈ ముగ్గురనూ చూడగానే యక్షిత, "మహేంద్రమణికై వచ్చిన మానవాధములా మీరు! కాచుకోండి, పుచ్చెలు ఎగిరిపోతాయ్!!" అంటూ చివాల్నలేచి, కత్తి ఝుళిపించింది. హరమతీ కాలమతులు హడిలిపోయి, వెనుకడుగు వేస్తూనే ప్రగల్భాలు కొట్ట నారంభించారు. "నోరు మూసుకొని, నా కాలు కదల్చండి; సింహద్వారం తెరుస్తాను. లేకపోతే ఈ కత్తితో నరికివేస్తా" నని యక్షిత సింహనాదం చేసింది.

ఆ అరుపుతో అన్నాతమ్ములు చచ్చినట్టు, యక్షిత కాలు పట్టారు. కాని, కొంచెమైనా కాలు కదల్చలేక, అలసి సొలసి చతికిలబడ్డారు. వాళ్లు ఓడిపోవటంచేత యక్షిత కత్తిదూసి వారిని నరకబోయింది.

ఇంతసేపూ దూరంగా వున్న దైవాధీనం ముందుకువచ్చి, "యక్షితా, ఆగు. నీకాలు




కదిల్చి, నా అన్నలను నేను రక్షించుకొంటాను" అన్నాడు. "సరేలే. శక్తిలో కాకపోయినా, మాటలలోఅయినా పడుచుతనం కనపడుతున్నది. నా కాలు కదుల్చు చూదాం. కదల్చలేకపోయావో నీ పితృదేవతల్ని కలుసుకొంటావ్ జాగర్త!" అని యక్షిత హుంకరించింది.

అప్పుడు దైవాధీనం, మహా కాలు కదిలించేవాడిలాగే చేతులు సవరించుకొని, పంజా విప్పి, వేళ్లు సారించి, వింతచేష్టలతో యక్షిత చూపులను అటూ యిటూ మరలించాడు. ఆమె అదమరపుగా ఉండటం కనిపెట్టి యక్షిత కాలు ముద్దు




పెట్టుకోబోయాడు. "ఛీ! ఇదేమిటి?" అంటూ ఆమె కాలు విదిలించుకుంది.

"అదుగో, యక్షితా! కాలు కదిలించావు. ఓడిపోయావు" అన్నాడు దైవాధీనం. అతని యుక్తికి మెచ్చుకొని, యక్షిత సింహద్వారం తెరచింది. ఈవిధంగా ముగ్గురూ సింహద్వారం దాటిపోగలిగారు.

అటుపైని దారి మరీ అగమ్యంగా కనపడింది. అంతా చీకటిపుష్కరం. అందుచేత, హరమతీ కాలమతులు "బాబోయి, మాకు మణీవద్దు, ఏమీవద్దు. బ్రతికివుంటే చాలు" నంటూ వెనుకడుగు వేయటం ప్రారంభించారు. వాళ్లకు ధైర్యం చెప్పి, ఎలాగో మకరద్వారంవద్దకు చేర్చాడు, దైవాధీనం.

ఈ గుహ సింహద్వారపు గుహకంటె ఎక్కువ భయంకరంగా వున్నది. పొగలూ వెలుగులతోపాటు, ఉండివుండి, ఎక్కడనించో గుండె పగులగొట్టేటటువంటి ఏడుపు వినవస్తున్నది. ఈ ఆర్తనాదం ఏ దిక్కునుండి వస్తున్నదో తీరా చూదామని వెతకబోతే ఎవ్వరూ కనపడరు. ఇది చూచి, వాళ్లకు భయమూ, ఆశ్చర్యమూకూడా కలిగినై.

ఇంతలో వాళ్ల ఎదుటనే తల విరబోసుకొని ఒక బండమీద కూర్చుని, వెక్కివెక్కి ఏడుస్తూవున్న యక్షిత ప్రత్యక్షమైంది. వీళ్లను చూడగానే ఆ యక్షిత "మహేంద్రమణికోసం వచ్చిన మానవాధములా మీరు! నన్ను నవ్వించగలిగితే మకరద్వారం తెరుస్తాను, లేకపోతే మిమ్మల్ని చంపివేస్తా" నంటూ గద్దించి చెప్పింది.

ఒశ్, ఇదెంతపని అనుకొని, హరమతీ కాలమతులు, నవ్వు పుట్టించే వక్రచేష్టలు ఎన్నో చేశారు. వాళ్ళ చేష్టలుచూచి, యక్షితకు మరింత ఏడుపే వచ్చింది కాని, నవ్వు రానేలేదు. "మీరు నన్నింక నవ్వించలేరు. మీకు చావే ప్రాప్తం" అనిచెప్పి, యక్షిత వాళ్లమీదికి ఉరకబోయింది. అన్నా

తమ్ముళ్లు ఇద్దరూ పోయి, దైవాధీనం వెనక నక్కారు. అప్పుడు దైవాధీనం ముందుకు వచ్చి, కిటుకు ఎక్కడ వున్నదో కనిపెట్టాలని, యక్షిత చుట్టూ ప్రదక్షిణంచేయ నారంభించాడు. లొట్టలు వేసుకొంటూ, అతను యక్షిత అందచందాలను పొగడటం కూడా ప్రారంభించాడు.

అతను తిరిగినట్టల్లా యక్షిత తిరుగుతూ వుండేవరకు, 'ఓహో, ఇదా నీ కిటుకు!' అనుకుంటూ, దైవాధీనం దానికి చక్కిలిగిలి పెట్టబోయాడు. కిచకిచమని యక్షిత ఒక్క గెంతు గెంతింది. కుప్పిగంతులు వేసుకుంటూ, దైవాధీనం యక్షిత వెంటపడ్డాడు. ఈ వాలకంచూచి, యక్షిత నవ్వు అపుకోలేక, మకరద్వారం తెరిచింది. ఒక్క చెంగున ముగ్గురూ మకరద్వారం కూడా దాటిపోయారు.

తరువాత అ(త్రిమూర్తులూ కమలద్వారం చేరుకున్నారు. ఇక్కడ యక్షిత విలాసంగా ఆడుతూ పాడుతూ వున్నది. ఆమెపాటకు హరమతీ కాలమతులు తన్మయులైనారు.

వీళ్లను చూడగానే, యక్షిత "ఓరి మానవాధములారా! నా చెల్లెళ్ళను మోసం చేసి వచ్చారా? చూడండి, ఇప్పుడే మిమ్మల్ని మింగివేస్తా" నంటూ, బ్రహ్మాండ




మైన రాక్షసి ఆకారం దాల్చింది. ఆ పెను భూతాన్ని చూచీ చూడగానే అన్నాతమ్ములు చావ సిద్ధపడి, మూర్ఛపోయారు.

అప్పుడు, యక్షితకూ దైవాధీనానికీ కామరూప విద్యలో ఘోరమైన యుద్ధం జరిగింది. చివరికి దైవాధీనం, ఒక సూక్ష్మ రూపంలో యక్షిత నోటిలో దూరి, దాని కుక్షిలో ప్రవేశించి, ఆయువుపట్టు చిక్కించుకొన్నాడు. అంతటితో యక్షిత లొంగిపోయి, ద్వారం తెరవటమేగాక, మహేంద్రమణిని పట్టుకువచ్చి, అతనిముందు పెట్టింది.

దైవాధీనం బయటకు వచ్చి, ఆ మణిని తీసుకున్నాడు. అప్పుడు ఆ యక్షిత అతనికి

"అనంతాస్తోక నిగమ నిగమన ఘృణీ మహేంద్ర మణీ" అనే మంత్రం ఉపదేశించి, అది పఠించినట్టయితే మణి ప్రకాశించి, కోరిన ఫలం ఇస్తుందని చెప్ప అంతర్థానమైంది.

ఈ విధంగా దైవాధీనం తన యుక్తిచేతా చాకచక్యంచేతా, కామరూపవిద్యాప్రభావంచేతా యక్షితలు ముగ్గురనూ గెలిచి, మంత్రంతోసహా మహేంద్రమణిని సాధించుకు రాగలిగాడు. ఇక యిప్పుడతను హరమతీ కాలమతులను మూర్ఛతేర్చి, మంత్రం పఠించి, మణిని పలికించి దాని విధానం వారికి చూపాడు.

ముగ్గురూ అక్కడినించి తిరిగివస్తూ, ఇంటిముఖంపట్టి, దారిలో మళ్లీ కాళికాలయందగ్గరకు వచ్చి అక్కడ కాస్త విశ్రాంతి తీసుకుందా మనుకున్నారు. దైవాధీనం మణిని తలక్రిందపెట్టుకుని పడుకొనడం చూచి హరమతీ కాలమతులు దురుద్దేశంతో కపటనిద్ర నటించారు.

ఇదేసమయానికి, గుణసుందరి తనను తలచుకొని తండ్రి పశ్చాత్తాపపడుతున్నాడనివిని, తండ్రిని చూచివద్దామని కోటలోకి వెళ్ళింది. రూపా హేమలు ఆమెను గడపలోనే అటకాయించి, "ఛోఛో, ఎరుకలవాళ్లనూ ఏనాదివాళ్ళనూ కట్టుకొని, మాకు ఎంత అప్రతిష్ఠ తెచ్చావు? నీభర్త హీనుడు, దరిద్రుడున్నూ" అంటూ అనరాని మాటలు అన్నారు.

పతినింద సహించలేక గుణసుందరికి ఆవేశం వచ్చి, "అక్కలారా! మీ రనుకొన్నట్టు, నాభర్త హీనుడూకాడు, దరిద్రుడూ కాడు. కామరూపవిద్య తెలిసిన వీరసేన మహారాజు. వారే మణిని తీసుకువచ్చి నాన్నగారిని రక్షిస్తారు" అన్నది సగర్వంగా.

సరీగా, ఆ క్షణాన దైవాధీనం నిద్రలో ఉండటంచూచి, హరమతీ కాలమతులు అతనిని ఒక పాడుబావిలో పడవేసి, ఆ మణిని పట్టుకొని, ఇంటికి ఉడాయించారు.

(ఇంకా వుంది)






చీపురుపల్లి గ్రామంలో సూరిశాస్త్రి అని ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన భార్యపేరు సోదెమ్మ. కూతురుపేరు వేదమ్మ. సోదెమ్మ పోరు పడలేక సూరిశాస్త్రి వేదమ్మను పెంట పాడులో ఉన్న కొండేవధానులుగారి కొడుకు చిట్టిపంతులు కిచ్చి పెళ్ళిచేశాడు. కూతురు కుంచమంతైనా ఎదక్క పూర్వమే 'పెళ్ళి పెళ్ళి' అని సోదెమ్మ తొందరపడటానికి కారణం లేకపోలేదు. పండుగలకీ పబ్బాలకీ పొరుగింటి పేరమ్మగారి అల్లుడు వస్తూ వెడుతూండడం ఆమె చూసి తనకుకూడా అల్లు డెప్పుడు వస్తాడో అని వేదమ్మ పుట్టక పూర్వంనుంచే ఉబలాటపడింది. తనకు పిల్లో, పిల్లాడో పుడతారని తెలినప్పుడు, "ఆడపిల్లే పుట్టాల"ని ఊళ్ళో అమ్మవారికి మొక్కుకుంది. మొక్కుకున్నట్లే వేదమ్మ పుట్టింది. పుట్టేక ఐదోఏటే వేదమ్మకి పెళ్ళి చేశారు. పెళ్ళిచేసిన వెంటనే సంక్రాంతి పండుగ వచ్చింది. పండుగకి చిట్టిపంతులు అత్తారింటి కొచ్చాడు.

వేదమ్మకి ఐదేళ్ళు ఐతే చిట్టిగాడికి ఎనిమిదేళ్ళు. అల్లుడు చిన్నవాడేగదా అని నెత్తిమీద చమురుపెట్టి, "నీ అమ్మ కడుపు చల్లగా, నీ అత్తకడుపు చల్లగా..." అంటూ దీవించి తలంటి, కొంగుతో తుడిచింది. సూరిశాస్త్రి కుట్టించి తెచ్చిన బొందులాగూ తొడిగి, పిన్నుపెట్టి, గాలిపడగ కొని ఇచ్చి 'ఎగరేసుకో'మంది.

పొరుగింటి పేరమ్మగారి అల్లుడూ పండగకు వచ్చాడు. పేరమ్మ పోలిబూరెలు వండి, పులిహారచేసి, ఇంకా ఏవేవో చేయ టానికని సిద్ధపడుతోంది. సోదెమ్మకేం పిండి వంట చెయ్యాలో ఓ పట్టాన్ని తెగలేదు. తెగకపోవటానికి కారణం ఏమిటంటే ఏమి చేద్దామనుకున్నా, పప్పో, పిండో, నూనో, నెయ్యో, బెల్లమో పంచదారో కావాలికదా.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు



అల్లుడికి చేసిపెట్టటానికి సోదెమ్మ ఇంట్లో ఏమీ లేకపోయింది. "అల్లుడికి ఏమిటి ఇష్టమో కనుక్కొని ఆపైన సంబారాల కోసం తడుములాడుకుందాం" అనుకుంది. చిట్టిగాణ్ణి పిలిచి, "నీకేం తినాలనుందోయ్?" అని అడిగింది.

ఎవరూ అల్లుళ్ళని అలా అడగనూ అడగరు, అడిగినా అల్లుళ్ళు చెప్పనూ చెప్పరు. కాని "చిట్టిపంతులు చిన్నవాడు గదా, అడిగి తెలుసుకుంటే తప్పేమిటి?" అని సోదెమ్మ అడిగేసింది. చిట్టిపంతులు చెపితే తప్పేమిటని తనకేది ఇష్టమో చెప్పే శాడు కూడాను. "నాకు చక్కిలాలు కావాలి" అన్నాడు. సోదెమ్మ సంతోషించింది. చక్కిలాలకి వరిపిండి ఉంటేచాలు. ఇంట్లో డబ్బాలో సిద్ధంగా పిండి ఉన్నది కూడాను. ఉత్సాహంతో సోదెమ్మ చువ్వలా లేచి, చకచకా చారెడేసి చక్కిలాలు తయారుచేసింది. చల్లారటంతోనే నాలుగు చక్కిలాలు చిట్టిపంతులు చేతిలో పెట్టింది.

కుఱ్ఱవాడైతేమాత్రం అల్లుడయాక కొంచెమైనా మొహమాటం ఉండాలికదా? కాని చిట్టిపంతులుకి అలాంటి మొహమోటం లేకపోయింది. "అత్తయ్యా, ఉత్తుత్తి చక్కిలాలైతే నాకు ఇష్టముండదు" అన్నాడు. "మరేం కావాలి?" అని అడిగింది సోదెమ్మ. "మా అమ్మ నాకు వాటిని పాలల్లో ముంచి పెట్టేది" అన్నాడు.

పాపం సోదెమ్మగారింట పాలులేవు. ఆమెకున్నదల్లా అల్లుడు రావాలన్న సరదా ఒక్కటే. సరదాతో బాటు చెయ్యటానికి శక్తి కూడా ఉంది కాని ఇంట్లో సరుకులేదు. చిట్టిపంతులు పాలు అడిగేడనికదూ చెప్పేను? నోరువిప్పి అడిగేక, ఎక్కడైనా అప్పైనాచేసి తెస్తుందిగాని మానుతుందా? అల్లుడి మనసు ఎలాగైనా తీర్చాలని సోదెమ్మ పంచపాత్ర పుచ్చుకు బయల్దేరింది. ఎక్కడికో వెళ్ళటం ఎందు

కని, పేరమ్మనే అడిగింది. "మా యింటి పాలు పిల్లి తాగేసింది. కాసిన్ని బదులియ్యి పేరమ్మా, సాయంకాలం తీరుస్తాను" అంది. సోదెమ్మగారింట పిల్లి ఉన్నమాట నిజమే గాని అది పాలు త్రాగేసిందన్నమాటమాత్రం శుద్ధ అబద్ధం. వాళ్ళింట అసలు పాలు ఉంటేగా, పిల్లి త్రాగిపోవటానికి?

ఏ కళనుందో గాని పేరమ్మ వెంటనే చిక్కటిపాలు పాత్రనిండా పోసి ఇచ్చింది. వాటిని తెచ్చి సోదెమ్మ చిట్టిగాడి ముందు పెట్టింది. వాడు చక్కలాన్ని పాలల్లో ముంచి, కాస్తకాస్త కొరుక్కు తినేశాడు.

వాడి నాలుగు చక్కలాలూ ఐపోయాయి కాని, పాత్రలో పాలు మాత్రం అలాగే ఉన్నాయి. ఏ గారెముక్కో రొట్టెముక్కో ఐతే ముంచినప్పుడు పాలను పీల్చుకుంటుంది గాని రాయికిమల్లే గట్టిగా ఉండే చక్కలాలు పాలేం పీల్చుకుంటాయి? అందు చేత పంచెపాత్రలో తెచ్చినపాలు తెచ్చినట్టుగానే ఉండిపోయాయి. పాలు అప్పు తీర్చటం ఎలాగరా భగవంతుడా అని బెంగపెట్టుకున్న సోదెమ్మ ఆ పాలు తరక్కుండా పంచపాత్ర నిండుగా ఉండడం చూచింది. ఆమె మెదడులో మెరపులాంటి ఆలోచన ఒకటి తట్టింది. ఆ మిగిలిన పాలు ఆమె



ట్టునే పట్టుకెళ్లి పేరమ్మకి అప్పు తీర్చేసి చక్కా వచ్చింది!

సూరిశాస్త్రి ఇంటికొచ్చి, "ఏమే, అల్లుడికేమైనా చేసి పెట్టేవా, లేదా?" అని అడిగేడు, అక్కడికి తనేవో అన్ని సరుకులూ ఇంటికి తెచ్చి పడేసినట్లు! సోదెమ్మ నవ్వుతూ, "అప్పువారి అప్పూ తీరె, అల్లుడి మనసూ తీరె!" అంది. "అదేమిట"ని ఆశ్చర్యంతో శాస్త్రి అడిగితే, మిగిలిన ఒక్క చక్కలమూ ఆయన చేతిలో పెడుతూ సంగతంతా చెప్పింది సోదెమ్మ. సూరిశాస్త్రి చక్కిలాన్ని పటుక్కుమనిపిస్తూ, సోదెమ్మ తెలివికి మెచ్చుకున్నాడు.




ఓ అడవిలో పెద్ద సరస్సొకటుంది. కోతుల రాజ్యానికి రాజైన వాలి ఒకనాడా సరస్సు పక్కనుంచి వెడుతున్నాడు. అతను అక్కడకు చేరుకునేసరికి సరిగ్గా సాయంత్రమై భక్తులంతా దేవుడికి పూజ చేసే వేళయింది.

వాలి గొప్ప శివభక్తుడు. అతడు ఎక్కడకు వెళ్లినాసరే తనతో కూడా దేవతార్చనపెట్టెలో శివలింగాన్ని పెట్టుకుని మరీ వెళ్లేవాడు. అతనా సరస్సు దగ్గిర ఆగి, అందులో స్నానంచేసి వచ్చి, గట్టుమీద ఓ శుభ్రమైన చోట ఆకూ అలమూ తుడిచేసి, దేవతార్చనపెట్టెలో ఉన్న శివలింగాన్ని పైకితీసి, అక్కడపెట్టి, మామూలు ప్రకారం పూజచేయడం మొదలెట్టాడు. అతను పూజ చేస్తూంటే, ఆ అడవిలో వేటాడుతో తిరుగుతోన్న చెంచువాళ్ళు విల్లులూ, బాణాలూ పుచ్చుకుని ఆ పూజచూస్తూ నిలబడ్డారు.

వాళ్ళు చంపి తెచ్చిన మృగాల్ని ఓచోట కుప్పగా పడేసి, వాళ్లుకూడా భక్తితో శివలింగానికి నమస్కారాలు పెట్టేరు. వాలి పూజచేస్తూన్న ఆ లింగాన్ని చూచినకొద్దీ, వాళ్ళకి భక్తి ఎక్కువైపోయి, "అయ్యో, మనకికూడా ఇలాంటి దేవుడుంటే రోజూ ఎంచక్క భక్తితో పూజ చేసుకుందుము గదా" అనిపించింది.

వాలి పూజ ముగించి, దేవతార్చన పెట్టెను దులిపి, లింగాన్ని తీసి అందులో పెట్టుకుందా మనుకుని తాను పెట్టిన పువ్వులూ, పత్రీ లింగంమీదనుంచి పక్కకి ఒత్తిగిస్తున్నాడు.

చెంచులు ఇంక పోదామని వెనక్కి తిరిగి చూసుకునేటప్పటికి ఒక చిత్రం జరిగింది. వాళ్ళు చంపితెచ్చి అక్కడ పడేసిన మృగాలొక్కొక్కటే బ్రతికి కదలటం మొదలెట్టేయి. వాళ్ళు

పి. సౌభాగ్యలక్ష్మి



ఆశ్చర్యంతో చూస్తూనిలబడిపోయేటప్పటికి కదలటంతో ప్రారంభించిన మృగాలన్నీ ఒక్కమాటుగా లేచి, భయంకరంగా అరుస్తూ పారిపోవ నారంభించాయి.

వెఱ్ఱి మొహా లేసుకుని చూస్తూ నిల పడితే ఆ మృగాలు తప్పించుకు పారిపోతా యని తోచి చెంచులంతా తమ విల్లులు ఎక్కుపెట్టి, అమ్ముల పొదులలోకి చేతులు పోనిచ్చి బాణాలు లాగేరు. తీరా చూస్తే ఆ బాణాలన్నీ తాము తెచ్చుకున్న ఇనప బాణాలుగాక, బంగారపు బాణాలుగా మారిపోయివున్నాయి. వాళ్ళంతా ఆ పారి పోతూన్న మృగాలమాటే మరిచిపోయి ధగధగ మెరిసే ఆ బాణాలు చూసు కుంటూ నిలబడిపోయారు.

వాలి జరిగినదంతా చూసి, "ఇదంతా నా శివలింగం యొక్క మహాత్యం" అన్నాడు. చెంచు లామాట విని వాలి కాళ్ల మీద పడి, "మహిమ గల ఈలింగాన్ని మాకు ఇచ్చెయ్యండి. మేము పూజచేసు కొంటాము" అని ప్రార్థించారు.

వాలి వికవికా నవ్వి, "మీ మొహం మీకు పూజేమిటి పొండి" అన్నాడు. "ఏమండీ, అలా తోసి పారేస్తున్నారు? మేమూ మీకుమల్లే భక్తులమే" అన్నారు చెంచులు. "ఏడిచినట్లే ఉంది మీమాట! భక్తిలో నాకూ మీకూ సాటా? దోమకీ ఏనుగకీ ఎంత వార ఉందో మీ భక్తికీ నా భక్తికీ అంత వార ఉంది. ఇంతకీ మీకు లింగం కావలసివస్తే ఎక్కడైనా తెచ్చు కోండి గాని నా దేవుణ్ణి నే నివ్వను" అని చెప్పివేశాడు వాలి.

మరొకడూ, మరొకడూ ఐతే చెంచులు బలవంతంగా లింగాన్ని లాగివేసి ఉందురు గాని, వాలి చాలా బలమైనవాడు గనక భయంవల్ల వాళ్లు మారుచెప్పక తమదారిని పోక తప్పిందికాదు. శివునిమీద ఉండే



భక్తికొద్దీ వాళ్లు ఆ లింగాన్ని విడిచిపెట్టలేక దానివైపే చూస్తూ పోయారు.

వాలి లింగాన్నితీసి పెట్టెలో పెట్టుకుందా మనుకుంటే, అదేంచిత్రమోగాని ఆ చోటు నించి అది ఊడివచ్చింది కాదు. "ఇదేమిటి? ఇంతలో నే ఎలా పాతుకు పోయిం దీ లింగం?" అనుకుంటూ వాలి, దాన్ని గట్టిగా పట్టుకుని తీయబోయాడు. లాభం లేకపోయింది. ఒంటిచేతికి సాధ్యం కాకపోవటం చూచి రెండోచెయ్యికూడా జోడించి కదిల్చేడు. లింగం కదలలేదు. తన తోకతో లింగాన్ని చుట్టి, ఊపిరి బిగబట్టి, బలమంతాచేర్చి లింగాన్ని పెకలించబోయాడు. కాని కొంచెంగూడా కదల్లేదు ఆ లింగం!

వాలికి చాలా ఆశ్చర్యం వేసింది. పెద్ద పెద్ద పర్వతాల్ని ఇట్టే పెకలించివేయగల బలం అతనిది. అలాంటప్పుడు ఈ చిన్న లింగాన్ని కదల్చలేకపోవడ మేమిటి? "నామీద దేవుడి కేదో కోపం వచ్చింది. అందుకే ఇలా తన మహిమ చూపిస్తున్నాడు" అనిపించి, కళ్ళవెంట నీరు కారుస్తూ లింగానికి సాష్టాంగ నమస్కారం చేసి "స్వామీ, నేను చేసిన అపరాధ మేమిటి? నువ్వు ఊడిరాకుండా ఇక్కడే స్థాపితమైతే ఎలాగ? మనం ఇంటికి పోవద్దా? అక్కడ కోతులన్నీ నాకోసం ఎదురుచూస్తుంటాయి. రా. వెళ్ళిపోదాం" అని అనేకవిధాల ప్రాధేయపడ్డాడు.

అప్పుడు శివుడు వాలికి ప్రత్యక్షమయి, "వాలీ, నాకిక్కడ ఉండిపోవాలని ఉంది. ఇక్కడి భక్తులు స్నానంచేసి నన్ను సేవించటానికి వీలుగా ఇక్కడే సరస్సుకూడా ఉంది గనక ఇంక కదలను" అన్నాడు. అప్పుడు వాలికి తెలిసొచ్చింది: "నేను ఈ చెంచులకన్నా గొప్ప భక్తుణ్ణి అనుకున్నా. దేవుడు నా ఒక్కడి సొత్తు అనే అహం

భావంతో 'ఈలింగం మీకు ఇవ్వను పొండి' అన్నాను. 'నాకు భక్తులంతా సమానమే. భక్తు లందరికీ నేను దేవుణ్ణే' అని నాకు చెప్పటంకోసం శివు డిలా చేసివుంటాడు" అని తెలుసుకున్నాడు.

"స్వామీ, నేను ఆ భక్తుల్ని చులకన చేసి మాట్లాడినందుకు నన్ను క్షమించు. నిన్ను విడిచి నే నొక్క క్షణంకూడా ఉండలేను. కనుక ఇంక ఆలస్యంచెయ్యక నన్ను అనుగ్రహించి నాతో రావలసిందే" అని బ్రతిమాలుకున్నాడు. కాని అంతకు ముందే శివుడు అంతర్ధాన మైపోయాడు.

పాపం వాలికేమీ తోచిందికాదు. ఆ లింగం తనతో రాదు. దాన్ని విడిచి తాను పోలేడు. అప్పుడతనికొక చిత్రమైన ఉపాయం తోచింది. "శివు డిక్కడ ఉండి పోతాననటానికి సరస్సు కొంత కారణం గదా. దీన్ని పూడ్చేస్తే, శివుడి కీప్రదేశం మీద ఉండే మోజుపోయి అప్పుడు నేను కోరినట్లు నాతోరాకపోతాడా" అనుకొన్నాడు.

ఇలా అతను ఆలోచించి, సరస్సు పూడ్చడానికి ఆ చుట్టుపక్కల ఏదైనా పెద్ద కొండ ఉందేమో అని అటూ ఇటూ చూచాడు. ఎక్కడా కనపడలేదు. అప్పుడు



కొన్ని వందల యోజనాలు యెగిరివెళ్లి ఓపెద్దకొండను పెకలించి తెచ్చి, ఆ సరస్సులో పడేశాడు.

ఐతేం, వాలి అనుకొన్నదొకటీ చివరికి జరిగిందొకటీన్నీ. ఆ కొండ కిందకు పడీ పడటంతో ఆ సరస్సు పూడిపోవడానికి బదులు అందులో ఉన్న నీరంతా పొంగి ఓ నదిగా ప్రవహించినది.

నదిని చూడగానే వాలికి ఉడుకు మోత్తనమూ, దుఃఖమూ వచ్చి, ఆవేశంతో "స్వామీ నువ్వు రాకపోతే నేనిక్కడే బుర్ర బద్దల కొట్టుకుని చచ్చిపోతాను" అన్నాడు.

శివునికి జాలివేసి మళ్లీ ప్రత్యక్షమై, "వెర్రివాడా! కొండతెచ్చి చెరువులో పడేస్తే నేను నీవెంట వచ్చేస్తా ననుకున్నావు. కాని చెఱువులో నీరు నదిగా మారి భక్తుల స్నానాలకువీలుగా దివ్యమైనప్రవాహమైంది. ఈవిధంగా ఈ కొండతెచ్చి ఇక్కడ పడ వేసి, తలవని తలంపుగా నాకు ఉపకారమే చేశావు. అదీగాక, నీవు చేసిన ఈపని మరొకవిధంగాకూడా నాకుఉపకారమైంది. ఏమంటే, నాకు కొండఅంటే మహా ఇష్టం. అందుకే కైలాసంమీద నేనుండడం. ఇక్కడేదైనా ఓ కొండ ఉంటే బాగుండునని నేను ఆలోచిస్తోంటే, నీవు దాన్నితెచ్చి పడేసి ఆ లోపం పూర్తి చేశావు. అయితే, నీతో కూడా నన్ను రమ్మనే కదా నువ్వు ఆరాట పడేది? నేను లింగాన్ని అయి నీదేవతార్చన పెట్టెలో ఉండడంకన్న ఏకంగా నీ హృదయంలోనే ప్రవేశించి నీతో వస్తాను. భక్తులకోసం యీ లింగాన్ని ఇక్కడనే ఉండి పోనియ్యి" అని చెప్పి, స్వామి వాలి హృదయంలో ప్రవేశించాడు.

వాలి కళ్లుమూసికొని ధ్యానించేటప్పటికి అతనికి తనలోని శివుడు ఒక జ్యోతికిమల్లే ప్రకాశిస్తూ కనపడ్డాడు. వాలి "ధన్యుణ్ణి అయా"నని సంతోషిస్తూ, మనస్సులోఉన్న శివుణ్ణి ధ్యానించుకుంటూ, యింటికి వెళ్లి పోయాడు.

మర్నాడు చెంచులువచ్చి అక్కడ ఉండిపోయిన లింగాన్నీ, కొత్తగా వచ్చిన కొండనీ, కొండ పడడంవల్ల ప్రవహించిన నదినీ చూచి, పొంగిపోయారు. నాటినించీ రోజూ రెండు పూటలా స్వామిని భక్తితో పూజచేసుకొంటూ వారూ ధన్యులయ్యారు.

భక్తుల కోరికలను నెరవేర్చే ఆ పరమ శివుడు ఈ విధంగా అటు వాలినీ, ఇటు చెంచులనీకూడా సంతృప్తిపరచాడు.





# మార్పు లేని మనిషి

ఒక ఊరిలో ముగ్గురు అన్నాదమ్ములు ఉండేవారు. పెద్దవాడు సూర్యవర్ధనుడు. రెండవవాడు చంద్రవర్ధనుడు, కడసారి వాడు బాలవర్ధనుడు. తండ్రి వీరికి విడిచి పోయిన ఆస్తి ఒక్క మామిడిచెట్టు మాత్రమే. అయితే, ఆ మామిడిచెట్టు చాలా చిత్రమైంది. ఇప్పుడూ అప్పుడూ అనకుండా మున్నూట అరవైరోజులూ అది కాస్తూనే వుంటుంది.

ముగ్గురు అన్నాదమ్ములలోనూ ఒకయిద్దరు ఆ చెట్టు కాయలు కోసి పట్టుకుపోయి, ఊళ్ళో అమ్ముకురావడం, మూడవవాడు చెట్టుకి కాపలా కాస్తూవుండటం — ఇదీ వాళ్ళ ఏర్పాటు.

ఒక రోజున చెట్టు కాపలాకాయడం బాలవర్ధనుడి వంతు వచ్చింది. సూర్యవర్ధనుడూ, చంద్రవర్ధనుడూ కాయలు పట్టుకొని ఊళ్లోకి వెళ్లారు. ఆ సమయంలో వృద్ధుడైన ఒక సన్యాసి ఆ చెట్టువద్దకు వచ్చి, "నాయనా! నాకు ఆకలీ దాహమూ అవుతున్నది. ఒక్క మామిడికాయ ఇచ్చి పుణ్యం కట్టుకుంటావా?" అని అడిగాడు.

అందుకు బాలవర్ధనుడు, "తాతా! నాకు ఇద్దరు అన్న లున్నారు. వాళ్లిద్దరూ ఈరోజున పళ్లు పంచుకొని వెళ్లిపోయారు. అందుచేత వాళ్ల కొమ్మలు తాకడానికి నాకు అధికారం లేదు. నా వాటాలో కొమ్మలు అవిగో. వాటిలో నీకు ఇష్టమొచ్చినన్ని పళ్లు తీసుకోవచ్చు" అనేవరకు, సన్యాసి "సరే, అలాగే చేయ"మన్నాడు. అప్పుడు బాలవర్ధనుడు చెట్టెక్కి నాలుగు పళ్లుకోసి, సన్యాసికి ఇచ్చాడు. అవి పుచ్చుకొని, సన్యాసి సంతోషంతో వెళ్లిపోయాడు.

మరునాడు చెట్టు కాపలా కాయడం సూర్యవర్ధనుడి వంతు. వృద్ధ సన్యాసి సూర్యవర్ధనుడి వద్దకు వచ్చి, బాలవర్ధనుణ్ణి

ముద్దా. సోమప్పశాస్త్రి, మద్రాసు



అడిగినట్టే అడిగాడు. సూర్యవర్ధనుడు తన వంతు కాయలలో నాలుగు ఎంచితీసి, సన్యాసికి భక్తితో సమర్పించాడు. సన్యాసి సంతోషించి వెళ్లిపోయాడు.

మూడవరోజున చంద్రవర్ధనుడు చెట్టు కాపలా కాయడానికి నిలిచిపోయాడు. వృద్ధసన్యాసి ఇతనివద్దకు కూడా వచ్చి కాయ అడిగేవరకు, చంద్రవర్ధనుడు తన వంతు కాయలలో నాలుగు మంచి కాయలిచ్చి, సన్యాసిని సంతోషపెట్టాడు.

కొంతకాలమైన తరవాత ఆ వృద్ధ సన్యాసి మళ్లీ అన్నదమ్ములు ముగ్గురనూ కలుసుకుని, 'అబ్బాయిలూ! నాతో రండి. చిత్రాలు చూపిస్తాను' అని చెప్పి, వెంట పెట్టుకు పోయాడు.

కొంచెము దూరం పోయేవరకు, వారికి సముద్రం అడ్డు వచ్చింది. అప్పుడు సన్యాసి సూర్యవర్ధనుడి వేపు తిరిగి, 'నాయనా! ఈ సముద్రం నీ అధీనంలో ఉంచుతున్నాను. నీవు ఏమికోరుకుంటే అది తప్పక నెరవేరుతుంది' అన్నాడు. 'ఐతే, ఈ సముద్రంలో వుండే ఉప్పునీళ్లన్నీ తియ్యటి తెల్లటి క్షీరములుగా మారిపోవాలి' అని కోరుకునే వరకు, వెంటనే ఆ సముద్రం క్షీరసముద్రంగా మారిపోయింది. సూర్యవర్ధనుడు ఆ పాలనుంచి పెరుగు, వెన్న, నేయి తీసి, వ్యాపారం ప్రారంభించాడు. త్వరలోనే ధనవంతుడై అక్కడనే నివాసం ఏర్పరుచుకున్నాడు.

తరువాత సన్యాసి, తక్కిన ఇద్దరినీ వెంట బెట్టుకొని మళ్లీ బయల్దేరాడు. కొంత సేపటికి ఒక పెద్ద మైదానం కనబడింది. అందులో కొన్ని లక్షల పావురాల పిట్టలు గింజలు ఏరుకొని తింటున్నాయి. సన్యాసి ఈసారి చంద్రవర్ధనుడి వేపు తిరిగి, "నాయనా! ఈ మైదానము, పావురాలు నీ అధీనం చేస్తున్నాను. నీమనస్సులో కోరిక

ఏమిటో చెప్పు, నెరవేరుస్తాను" అన్నాడు. 'అయితే, ఈ పావురాపిట్టలన్నీ గొఱ్ఱెలుగా మారిపోవాలి' అని కోరాడు చంద్రవర్ధనుడు. వెంటనే మైదానమంతా గొఱ్ఱెలతో నిండి పోయింది. చంద్రవర్ధనుడు అక్కడనే స్థిరపడి, ఆ గొఱ్ఱెల ఉన్నితో తివాసీలు నేయించి వర్తకం ప్రారంభించి, ధనవంతుడయినాడు.

పోతే, వృద్ధసన్యాసి బాలవర్ధనుణ్ని తీసుకుని ముందుకు సాగిపోయాడు. పోగా పోగా, ఒక చిన్న ఆలయమూ, అందులో దేవీ విగ్రహమూ కనబడినై. అక్కడ ఆగి, వృద్ధసన్యాసి బాలవర్ధనుడితో "అబ్బాయీ! ఈ గుడిలో ఉండే దేవిని తలుచుకుని, నువ్వు ఏమి కోరుకుంటే అది నెరవేరుతుంది" అని అనేవరకు, బాలవర్ధనుడు "ఐతే స్వామీ! దాపరిక మెందుకు? నాకు ఒక్కటే కోరిక ఉన్నది. ఈ ఊరి పట్టపు రాజు కూతురును పెళ్ళాడాలి" అన్నాడు.

బాలవర్ధనుడి కోరికకు సన్యాసి చిరునవ్వు నవ్వుకొని, 'బలే ఘట్టివాడవేనోయి నాయనా!' అని ప్రేమతో వీపు తట్టి అతనిని తనవెంట రాజుగారి కోటకు తీసుకుపోయాడు.



వృద్ధసన్యాసీ, బాలవర్ధనుడూ కలిసి వెళ్లేసరికే అక్కడ ఇద్దరు రాజకుమారులు తయారుగా కూర్చుని వున్నారు. ఇప్పుడు రాజకుమారికోసం వచ్చిన బాలవర్ధనుడు మూడవ వా డన్నమాట.

రాజకుమార్తెను పెళ్లాడటానికి ముగ్గురు యువకులు పోటీగా కూర్చునేవరకు, రాజుకి ఆలోచన పాలుపోలేదు. ఆయన వృద్ధసన్యాసికి నమస్కరించి "మహానుభావా! మీరు సర్వజ్ఞులు. మా క్షేమం కోరినవారు. కనుక, వివాహవిషయంలో మీకు తోచినట్టు నిశ్చయించండి" అన్నారు.




అప్పుడు వృద్ధసన్న్యాసి "మూడు గులాబీ మొక్కలు తెప్పించి, ముగ్గురు యువకుల పేర్లూ వాటిపైన రాయించి, రాజకుమారిని స్వయంగా అందరి ఎదుటా నాటమనండి. అందులో ఏ మొక్క, రేపు ఉదయానికల్లా పూస్తుందో, ఆ యువకుణ్ని ఆమె వరించినట్టే నిశ్చయం" అని చెప్పాడు. అందరూ ఈ ఏర్పాటు బాగున్న దన్నారు.

అందరి ఎదటా రాజకుమారి మూడు మొక్కలూ నాటింది. సన్న్యాసి మహిమ వల్ల బాలవర్ధనుడి పేరు రాసిన మొక్క మాత్రం మరునాటికల్లా చక్కటి పువ్వు పూసింది. తక్కిన రెండు మొక్కలు నాటినవి నాటినట్టే ఉన్నాయి. కనుక, రాజకుమారికీ బాలవర్ధనుడికీ అతి వైభవంగా వివాహం జరిగింది.

ఆ దేశాచార ప్రకారం అడవిలో ఒక కుటీరం నిర్మించుకొని, నూతన దంపతులు ఐదేళ్లపాటు అందులో కాలక్షేపం చేయాలి. ఆ ప్రకారమే ఇప్పుడు బాలవర్ధనుడు, రాజకుమారీ నివసిస్తూ వున్నారు.

ఇలా ఉండగా, ఒకనాడు ధనవంతుడైన సూర్యవర్ధనుడివద్దకు సన్న్యాసి ఒక బిచ్చగాని రూపంలో వెళ్లి, "చాలా దాహంగావున్నది. మీకు దేవుడు కోకొల్లలుగా పాడి అనుగ్రహించాడుకదా. కొంచెం మజ్జిగతేట ఇప్పించి పుణ్యం కట్టుకోండి" అని ప్రార్థించాడు. దానికి సూర్యవర్ధనుడు "పోవోయి పకీ! — మజ్జిగలు ధర్మంగా పోయటానికి ఇదేమీ చలివేంద్ర కాదు. వర్తకానికీ ధర్మానికీ చాలాదూర ముంది. వెళ్లు వెళ్లు" అంటూ కసరికొట్టాడు.

అప్పుడు సన్న్యాసికి కోపంవచ్చి "అప్పుడే నీకింత కళ్లు నెత్తిమీదికి వచ్చాయా? నిన్ను నువ్వు తెలుసుకునే టట్టు చేస్తానుండు" అనిచెప్పి సముద్రంపైన మంత్ర జలం చల్లేవరకు, చూస్తూవుండగానే

తెల్లటి క్షీరసముద్రంమారిపోయి, అందులో మళ్లీ మామూలుగా ఉప్పునీళ్లు సిద్ధమైనై. సూర్యవర్ధనుడితో సన్యాసి "మేలు మరచిన కృతఘ్నుడా! నీవు ఎప్పటిలాగా మామిడిచెట్టువద్దకుపోయి, కాపలా కాసుకొంటూవుండు. పో!" అని చెప్పి అదృశ్యమైనాడు.

ఇక రెండోవాడు ఎలా మారిపోయాడో కనిపెట్టాలని, సన్యాసి మారువేషంతో చంద్రవర్ధనుడి వద్దకు పోయి, "నాయనా! చలితో వణికిపోతున్నాను. ముసలి ముండావాడిని. మీకు దేవుడు ఇన్ని గొఱ్ఱెలను ఇచ్చాడుకదా. మీకు పనికిరానిది ఒక చింకి కంబళిముక్క నాకు పారవేయండి. మీ పేరు చెప్పుకొని కప్పుకొంటాను" అని కోరేసరికి, చంద్రవర్ధనుడు "సరిసరి, మేము నేసిన కంబళీలు నాలుగూ నీలాంటి సన్యాసులికి పంచిపెట్టివేస్తే, మేము ఎక్కడికి పోవాలె? మా వర్తకం ఏమి కావాలె? వెళ్ళువెళ్ళు..." అంటూ కసరికొట్టాడు.



"ఓహో, నీపని ఇంతవరకూ వచ్చిందా? నీవు ఎక్కడికి పోవాలో చెబుతానుండు" అంటూ మంత్ర జలం తీసి అభిషేకించేవరకు, అతని కళ్లముందరనే గొఱ్ఱెలన్నీ పావురాలుగా మారిపోయి, గాలిలోకి ఎగురనారంభించినై. సన్యాసి అతనివేపు తిరిగి "పిచ్చి నాయనా! ఇక ఇంతటినించీ నీవు మామూలుగా నీ మామిడిచెట్టువద్దకుపోయి కాపలా కాసుకుంటూ వుండు" అని చెప్పి, అంతర్ధాన మైనాడు.

అన్నలు ఇద్దరి సంగతి ఈవిధంగా పరీక్షించిన తరువాత, చిన్నవాడైన బాలవర్ధనుడిలో కూడ ఏదైనా మార్పు వచ్చిందేమో తెలుసుకోవాలెనని సన్యాసికి బుద్ధిపుట్టి, అడవిలో అతను నివసించే కుటీరానికి వెళ్లాడు.

సన్యాసి ఒక ముష్టివాని వేషంతో సరిగా భోజనాల వేళకు కుటీరంలో తయారై, ఆకలిగా ఉన్నదన్నాడు. ఇక భోజనం చేధామని సిద్ధంగా వున్న దంపతులు ఇద్దరూ ఆ ముష్టివానిని ఎంతో ఆనందంతో లోపలకు తీసుకుపోయి, తమ కోసం తయారుచేసుకొన్న అడవి తేనె, ఫలములు, వెదురు బియ్యపు అన్నము మొదలయిన పదార్థాలు అతనికి వడ్డించి, కడుపునిండుగా భోజనం పెట్టారు.

"అబ్బాయీ! - మేము చూడబోతే అయిదేళ్ల అరణ్యవాస దీక్షలో ఉన్నాము. కనుక, ఇంతకంటె ఎక్కువగా ఆదరించ లేకపోయాము,' అని సానుభూతి తెల్పారు.

వారు భక్తితో వడ్డించిన భక్ష్యాలు ఆనందముతో ఆరగించి, సాధువు చిరునవ్వు నవ్వాడు. "నాయనా! మామిడి చెట్టు కాపలా కాసేనాటి నీ మంచితనం మార్పు లేకుండా ఇప్పటికీ నీలో అలాగనే ఉన్నందుకు సంతోషించాను. నీవు మంచివాడవు గనుకనే నీకు తగిన భార్య దొరికింది. దేశాచారం ప్రకారం మీరు ఇంకా దీక్షలో ఉండవలసి నప్పటికీ, అరణ్యావాసం చేస్తున్నామే అనేబాధ మీకు ఇంతటినించీ కలగబోదు. మీరు ఎక్కడ వుంటే అక్కడే రాజభోగంగా వుంటుం"దని చెప్పి, ఆకుటీరంపైన మంత్రజలం చల్లాడు.

తక్షణమే ఆ కుటీరం ఒక రాజభవనంగా మారిపోయింది. అందులో, రాజుగారి కోటలోవున్నట్టే అన్ని హంగులూ అమరి వున్నాయి. బాలవర్ధనుడూ భార్యా మారు వేషంలో ఉన్న సాధువును గుర్తించి సాష్టాంగపడ్డారు. సాధువు వారిని దీవిస్తూ, అంతర్ధానమైనాడు వారికి తెలియకుండానే.

అంతటినుంచీ, బాలవర్ధనుడూ రాణీ హాయిగా వుంటున్నారు.






అనగనగనగా ఒక పట్టణంలో ఒక యువకుడు ఉండేవాడు. అతను పుట్టుపేద. పైగా, ముఖంమీద ఒక తెల్లని మచ్చ ఉండటంచేత, తోడివాళ్ళందరూ అతనిని 'బొల్లెయ్యా!' అనే పేరుతో పిలిచి, వేళాకోళం చేసేవాళ్ళు.

ఆ పట్టపు రాజుకి రూపసి అయిన ఒక కూతురున్నది. ఆమెను పెళ్ళాడుదామని ఎంతోమంది వీరులూ శూరులూ అయిన రాజకుమారులు ఉబలాటపడ్డారు. వాళ్ళతో పాటు బొల్లెయ్యకూడా ఆ రాజకుమారిని పెళ్లాడాలెనని సరదాపడ్డాడు. కాని, అతను రహస్యంగా అద్దంలో చూచుకొన్నప్పుడల్లా, "అయ్యో! నా ముఖంమీద ఇంత అసహ్యకరమయిన తెల్ల మచ్చ ఉన్నదే. నావంటి అనాకారిని ఆ రాజకుమారి వరిస్తుందా? అది కేవలమూ కలలో మాట!" అని అనుకొని, నిరాశచెందేవాడు.

ఒకరోజున బొల్లెయ్య రాజుగారి కోట ముందరినించే పోతూ, రాజకుమారిని చూచాడు. ఆమె కంటపడగానే, ఏమయితే అయిందని ధైర్యంచేసి, ఆమె ఎదటికిపోయి తన వుద్దేశం వెల్లడి చేశాడు.

దానికి రాజకుమారి, "బొల్లెయ్యా! నువ్వు నన్ను ప్రేమిస్తూవున్నట్టుగానే నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. కాని, లాభమేమున్నది? నాకు పెళ్ళి కాకూడదని సూర్యమహారాజు శాపమిచ్చాడు. ఆయన వద్దకు పోయి, శాపం తీసివేయండని కోరుదామంటే, అది సామాన్యులవల్ల అయే పని కాదు. కనుక, నాకు కలిగిన శాపం తీసివేయించగల సమర్థుడు దొరికేవరకు ఇలా నేను కన్యగా ఉండిపోవలసిందే" అన్నది.

'ఒక్, ఇదొక ఘన కార్యమా? ఆ సూర్యమహారాజువద్దకు నేను వెళ్ళివస్తానుండు' అన్నాడు బొల్లెయ్య.

వి. జానకి, సీతారాంపురం



'అలాగయితే, ముందుగా నీ ముఖం మీది మచ్చ పోగొట్టమని కోరుకో. నీమచ్చ ఎప్పుడైతే పోతుందో, నా శాపమూ అప్పుడే తొలగిపోతుంది' అంటూ రాజకుమారి సలహా చెప్పింది.

బొల్లెయ్య వెంటనే బయలుదేరి, అడవులు పట్టి, 'సూర్యమహారాజు రాజ్యానికి దారి ఏది?' అంటూ కనపడిన పక్షులనూ, వృక్షాలనూ, జంతువులనూ, కీటకాలనూ పలకరించి అడిగాడు. ఒక్కళ్ళూ తెలియదన్నారు.

చివరకు బొల్లెయ్య, ఒక ఏటిగట్టు చేరుకొన్నాడు. ఆ యేటిలో ఒక అందమయిన తెల్లటి హంస ఈదులాడుతున్నది. దానిని కూడా అడిగాడు బొల్లెయ్య. అందుకు ఆ హంస, "నా రెక్కలు పట్టుకొని వీపు పైన కూర్చోవయ్యా, నిమిషంలో నీకు దారి చూపిస్తా" నన్నది.

ఆ మాటకు సంతోషించి, బొల్లెయ్య హంస వీపుమీద ఎక్కి కూర్చున్నాడు. క్షణంసేపటిలో అది అతనిని అవతలి ఒడ్డుకి దిగబెట్టి, సూర్యమండలానికి దారి చూపింది. కొంచెందూరం పోయేసరికి, బొల్లెయ్యకు ఒక తుప్పలో బాణమూ అమ్ములూ కనపడినయి. తనది కాని వస్తువును తాకడం ఇష్టంలేక, బొల్లెయ్య తన దారిని తను పోబోతున్నాడు.

ఇంతలో ఒక యువకుడు కనపడి. "అబ్బాయీ! నా బాణమూ, అమ్ములూ కనపడకుండా పోయినయి. వాటిని ఎవళ్ళయినా చేత పట్టుకపోగా చూశావా?" అని అడిగాడు. దానికి బొల్లెయ్య "ఇక్కడికి సరీగా ఇరవై గజాల దూరాన, కుడి చేతివేపు తుప్పలో అవి నాకు కనపడినై, పోయి తెచ్చుకో!' అని చెప్పాడు.

'నువు చాలా న్యాయమంతునిలా ఉన్నావు. నిన్ను చూడగా సంతోషమైంది.

ఇలా ఎక్కడికి వెళుతున్నావు? ఎందుకు వెళుతున్నావు?' అని ఆ యువకుడు మళ్లీ అడిగేవరకు, బొల్లెయ్య తన సమాచారమంతా ఆ యువకునికి వినికిడి చేశాడు.

అది విని యువకుడు 'అయితే నువు నా వెంట వచ్చెయ్యి. మా నాయన గారే సూర్యమహారాజు. నాపేరు ఉదయతార' అని చెప్పాడు. బొల్లెయ్య చెప్పిన ఆనవాలు ప్రకారం ఉదయతార తుప్పదగ్గరకుపోయి తన బాణమూ, అమ్ములూ తీసుకొన్న తరవాత, నేస్తులిద్దరూ కలిసి పోయి సూర్యమహారాజు రాజ్యం చేరుకొన్నారు.

ఉదయతార నేస్తుడయిన బొల్లెయ్యను సూర్యమహారాజు, ఆయనభార్య ఛాయాదేవీ ఎంతో గౌరవించి, 'నీకు ఇష్టమొచ్చినంత కాలం ఇక్కడ మాకు అతిథిగా ఉండిపోవలిసింది' అని కోరారు. ఎవరి దర్శనం చేసుకుందామని బొల్లెయ్య ఆత్రంతో బయల్దేరాడో, ఇప్పుడు, ఆ సూర్య మహారాజే తనను ఈవిధంగా కోరేవరకు బొల్లెయ్యకు అపరిమితానంద మైపోయింది. ఇలా బొల్లెయ్యా, ఉదయతార ప్రాణ స్నేహితులుగా వుంటున్నారు.

* * *




ఒకరోజున, ఉదయతార 'వేటకు పోయి వస్తా' మని తల్లితో చెప్పేసరికి, ఆమె "నాయనా!—ఎక్కడికయినా వెళ్లు, కాని, గండకి నదివద్దకు మాత్రం పోబోకుమా! అక్కడ మాయా పక్షుల రూపంలో దుష్ట గ్రహాలు తిరుగులాడుతున్నాయట" అని హెచ్చరించింది. ఏపని అయితే వద్దు అంటామో ఆ పనే చేయుటం పిల్లల నైజం.

అందుచేత ఉదయతార 'సరేలే' అంటూ, తల్లి ఎక్కడికయితే వద్దన్నదో సరీగా ఆ గండకినదికే దారితీశాడు. కొంచెం సేపటికల్లా లెక్కలేనన్ని గ్రహాలు మాయ పక్షులుగావచ్చి ఉదయతారనూ, బొల్లె

య్యనూ చుట్టేసి, బాధించసాగాయి, సుకుమారుడైన ఉదయతార ఆ బాధకు తట్టుకోలేక, వెంటనే సోలిపోయాడు.

గుండె నిబ్బరంగల బొల్లెయ్య గభీమని బాణం చేతపట్టి, మాయపక్షులన్నిటినీ ముప్ఫయి ఆమడ దూరంవరకూ చెదరగొట్టాడు. కిందపడిన మాయపక్షులను గొంతు మెలిపెట్టి చంపివేశాడు!

కొంతసేపటికి ఉదయతార తేరుకొని లేవగానే, ఇద్దరూ కలిసి ఇంకా మిగిలివున్న మరికొన్ని పక్షులను పట్టి చంపివేశారు. తరువాత వాళ్లు ఇంటికి చేరుకొని గండకి నదివద్ద జరిగిన చిత్రాలన్నీ పూస గుచ్చినట్టు రాజుకూ రాణీకి చెప్పారు. బొల్లెయ్య ప్రజ్ఞవల్ల తమ కుమారుడు బతికి బయటపడినందుకు వారు సంతోషించారు.

అతని సాహసానికి మెచ్చుకొని సూర్యమహారాజు, ఏదైనా ఒక వరం కోరుకో మన్నాడు. ఇదే సమయమనుకొని, బొల్లెయ్య తన మనస్సులో వుద్దేశం దాపరికం లేకుండా ఆయనతో చెప్పాడు.

సూర్యమహారాజు 'సరే'నని చెప్పి మంత్రోదకం చల్లేసరికి, బొల్లెయ్య ముఖంమీది తెల్లమచ్చ ఒక్కసారిగా మాయమైపోయింది. ఆ మచ్చ పోయినవెంటనే అతనికి సుందరమైన స్వరూపం వచ్చింది. అప్పుడు బొల్లెయ్యకు రాజకుమారి చెప్పిన మాటలోని అంతరార్థం బోధపడింది. ఈవిధంగా తన ప్రజ్ఞవల్ల బొల్లెయ్య ఎవరికీ సాధ్యం కానటువంటి సూర్యమండలానికి పోయి, సూర్యమహారాజువద్ద వరంపొంది, తన మచ్చ పోగొట్టుకొనటమే గాకుండా రాజకుమారి శాపంకూడా విముక్తి చేయగలిగాడు. తరువాత అతను భూలోకానికి దిగివచ్చి, ఆ రాజకుమారిని పెళ్లిచేసుకొని హాయిగా ఉన్నాడు.






పూర్వకాలమందు ధనుంజయుడు అనే వేటకాడు ఒకడు ఉండేవాడు. అతను యువకుడు, మంచి బలిష్ఠుడు. భయమనేది ఎరుగని వాడు. ఎటువంటి కటిక చీకటి అయినా అతను కీకారణ్యాలలో ఒంటరిగా సంచరించ గలడు. ఎంతటి లోతైన సముద్రాలనైనా ధైర్యంగా దాటి వేయగలడు.

ధనుంజయుడు ఒకరోజున బయల్దేరి వెళ్లి ఒక కొత్తప్రదేశం చేరుకొన్నాడు. అది ఒక మైదానము. ఆ మైదాన మంతటా కంబళి పరచినట్టు అందమైన పచ్చటిగడ్డి ఆవరించి వున్నది. అక్కడక్కడ అందాల పూలమొక్కలు రకరకాల పరిమళాలను విరజిమ్ముతూ వున్నయి.

అతను ఆ మైదానమంలో కొంతదూరం పోయి, గతుక్కున ఆగిపోయాడు. అతని ముందర పళ్లెము కట్టినట్టు గుండ్రపాటి మండపము, అందులో అపురూపము లైన పూల మొక్కలూ ఉన్నయి. అవి చూడ డానికి మెట్లవలె పేర్చబడి, అదంతా దేవతలు విహరించే దివ్యస్థలమా అనిపిస్తూ వున్నది! ఆ మండపమంలోకి వెళదామంటే, ఎటువైపు చూచినా దారి కనబడదు. అక్కడ ఒక్క గడ్డిపరక నలిగిన ఆనవాలుగాని, ఒక పువ్వురేక తుంచిన ఆనవాలుకాని కనపడలేదు.

ధనుంజయుడు విడ్డూరంగా చూస్తూ, అలానే కనిపెట్టుకొని ఉండేవరకు, ఆకాశం పైనుంచి గానం చేస్తున్న ధ్వని అతని చెవులకు చల్లగా సోకింది. ఇదేమిటా అని మెడ ఎత్తి పైకి చూచేవరకు, ఒక గుండ్రటి ఆకారం భూమిమీదకు దిగబోతున్నట్టు కనబడింది. అతనికి ఇంతకుముందు వినపడిన గానము ఈ ఆకారమునుంచే బయల్దేరినట్టు ధనుంజయుడు గ్రహించాడు.

సి. హెచ్. ఆదినారాయణ, గుంతకల్లు




ఆ కన్యలు, మోకాలివరకు వేలాడుతూవున్న బంగారు కేశములతో బిలబిలమంటూ ఇవతలకు వచ్చి, గుండ్రటి మండపంలో ఒకరిచేతులు ఒకరు పుచ్చుకొని, నాట్యంచేయ నారంభించారు. వారు నృత్యం చేస్తూ మండపంచుట్టూ గిరగిర తిరుగుతూవుంటే, ఒక వెండితీగ రివ్వు రివ్వున చుట్టుకొంటూ వున్నట్టు కనిపించింది. అతనికి ఇంతకుముందు గానం వినిపించింది ఈగుండ్రటి ఆకారంలోనించే.

ఆ కన్యల అందచందాలను అతను గమనించాడు. వారందరూ ఒకేమోస్తరుగా అగపడుతూవున్నా, అందులో ఒకామె మాత్రం తక్కిన పదకొండు మందికంటే మించిన సౌందర్యంతో వెలిగి పోతున్నది. ఈమె అక్కచెల్లెళ్ళందరిలో కడసారిది అయిన తారాకన్య అని ధనుంజయుడు తెలుసుకొన్నాడు. అతని మనసు ఆమెపైకి పోయింది.

ఆ ఆకారము అంతకంతకు పెద్దది అయి, అందులోనించి బయల్దేరిన గానము అంతకంతకు హెచ్చుస్థాయిలోనూ, మరింత స్పష్టంగానూ వినపడజొచ్చింది.

మరి కొంచెమంసేపటికి, తను చూచిన ఆ స్వరూపము ఒక గుండ్రటి తట్ట అనీ, అందులో ఎవరో ఉన్నారనీ అతను కనిపెట్టాడు. ఆ జనాన్ని పరీకించి చూడగా ధగధగ మెరిసిపోతున్న నక్షత్రకన్యలు పన్నెండుమంది కనపడ్డారు. వారిలో అక్క ఎవరో, చెల్లెవరో పోల్చిపట్టడానికి వీలు లేకుండా, అందరూ ఒక్క మూసలో పోసిన ప్రతిమలలాగా వున్నారు.

ఇప్పటివరకు వాళ్ళ నాట్యం చూస్తూ వున్న ధనుంజయుడు, తారాకన్య అందం చూచి నిలవలేక, గభాలున పైకివచ్చేశాడు. నరుడుకంట పడగానే, నక్షత్రకన్యలు తట్టలోకి దూకి, ఎగిరిపోయారు.

అప్పుడు ధనుంజయుడు, తన తొందర పాటుకి పశ్చాత్తాపపడి, విచారంతో కుటీ రానికి మరలిపోయాడు.

ధనంజయుడికి చిత్రమైన మంత్రవిద్య తెలుసు. ఆ విద్యవల్ల అతను, తన ఇష్టము వచ్చిన రెండు జంతువుల స్వరూపాలు పొందవచ్చు. అంతటితో ఆమంత్రమహిమ అంతరించిపోతుంది.

అందుచేత, అతను ఆ నక్షత్రకన్యలను ఆకర్షిద్దామనే ఉద్దేశంతో, ఒక అడవిపిల్లి రూపం ధరించి, మండపానికి సమీపాన గడ్డిలో పొంచివుండి, నిద్రపోతున్నట్టు నటించాడు. మామూలువేళకు నక్షత్ర కన్యలు భూలోకానికి దిగివచ్చి, మండపం లో నృత్యం చేస్తున్నారు. ఇంతలో అడవి పిల్లి నెమ్మదిగాలేచి వారిదగ్గరగా పోబోయే వరకు, ధనుంజయుడు అనుకొన్నట్టుగా దానినిచూచి వారు ఆకర్షింపబడలేదు సరి కదా, ఆ అలజడికి వారు జడుసుకొని, తట్టలో దూరి, మళ్ళీ ఎగిరిపోయారు.

ఈవిధంగా, అతని ప్రయత్నం రెండవ సారికూడా ఫలించిందికాదు. ఇక ఇది పనికాదని, ధనుంజయుడు మళ్ళీ బాగా ఆలోచించాడు. చూడబోతే, తన మంత్ర




మహిమవల్ల ఇంక ఒక్క అవతారం మాత్రమే అతను ఎత్తటానికి అవకాశ మున్నది.

ఈసారి ఒక అడవిఎలుకల కుటుంబ ముగా మారిపోయి, మండపము దగ్గర ఉండే ఒక చెట్టుతొఱ్ఱలో నివాసం ఏర్ప రచుకొన్నాడు.

మరునాడు, మళ్ళీ మామూలు వేళకు నక్షత్రకన్యలు దిగివచ్చి, నాట్యం ప్రారం భించారు. ఇంతలో ముచ్చటైన చిన్నఎలు కలు అటు యిటు పాకులాడుతూవుండగా చూచి, వారు ఆ ఎలుకలనూ ఎలుక పిల్ల లనూ పట్టుకోబోయారు. ఇదిచూచి 'భేష్!



నా పన్నాగం ఈసారి ఫలించింది' అనుకొని అతను సంతోషించాడు. తండ్రిఎలుక రూపం దాల్చిన ధనంజయుడు, కావాలని పోయి, కడసారిదైన తారాకన్య చేతిలో చిక్కుకొన్నాడు.

ఆమె తనను తాకగానే అతను నిజస్వరూపం పొంది, తారాకన్యచేయి పట్టుకొనే వరకు, తక్కిన పదకొండుగురూ వెనక్కు తిరిగి చూడకుండా ఒక్క లిప్తలో ఆకాశానికి ఎగిరిపోయారు.

అప్పుడు ధనుంజయుడు, తారాకన్యను అనేకవిధాల లాలించి, ఆమెకు జంకు లేకుండా ధైర్యంచెప్పి, వేటనుగురించిన వింతలూ, అరణ్యాలనుగురించిన చిత్రాలూ చెబుతూ మెల్లగా ఆమెను తనకుటీరానికి తీసుకపోయాడు.

ఎలా అయితేనేమి, చివరకు ఆమె జంకు తీరి అతనిని మనసారా ప్రేమించింది. ఇద్దరకూ వైభవంగా వివాహం జరిగింది. నాటి నించీ వారు హాయిగానే వుంటున్నారు. కాని, తండ్రి అనుమతి లేకుండా స్వతంత్రించినందుకు ఆయన ఏమంటాడోనని తారాకన్యకు మనసులో భయంగానే వుంది.

* * *

తారాకన్య, నక్షత్రరాజులలో ఒకరాజు కూతురు. ఆమెకు కొన్నాళ్ళయిన తరువాత, నక్షత్రమండలానికి పోయి, తనవాళ్ళనూ తలిదండ్రులనూ చూడాలని బుద్ధిపుట్టింది.

ఒక తట్ట అల్లి మంత్రగానం చేసినట్టయితే, ఆ గానమహిమవలన విమానం మోస్తరుగా తట్ట పైకి ఎగిరిపోతుందని ఆమెకు తెలుసును. భర్తతో తన వుద్దేశం వెల్లడిస్తే, తను వెళ్ళకుండా అటంక పరుస్తాడనే భయంతో ఆమె ఎన్నడూ ఈసంగతి అతనికి తెలియనీయలేదు.

అనుకొన్నట్టుగానే కొన్నాళ్ళు శ్రమపడి, ఆమె ఒక తట్ట అల్లింది. దానిని రెండవ



కంటికి తెలియకుండా నృత్యంచేసే మండపం వద్దకు తీసుకొనిపోయి, అందులో ఆమె కూర్చుని, తన చిన్నారికొడుకును తనతో పాటు తట్టలో ఎక్కించుకొని, దివ్యగానం చేసేవరకు, విమానంలాగా ఆ తట్ట ఆకాశ మార్గాన ఎగిరిపోయింది.

దూరానవున్న ధనుంజయుని చెవులకు ఆ దివ్యగానం వినిపించింది. "ఇదేమిటి, వేళగానివేళ ఇప్పుడు దివ్యగానం వినబడు తోందే!" అని అనుకొంటూ, అతను నక్షత్రకన్యలు నృత్యంచేసే మండపం వద్దకు పరుగెత్తాడు.

అతను వెళ్ళి చూచేవరకు, కొడుకును ఎత్తుకొనివున్న తనభార్య, తట్టలో ఎగిరి పోతూవుండటం కంటబడింది. ఎగిరిపోతూ వున్న తారాకన్యను అనేకవిధాల బతిమాలి, "నన్ను వదలిపోవటం న్యాయమా? నేనేం పొరపాటుచేశాను?" అంటూ అతను ప్రాధేయపడ్డాడు. తట్ట అంతకంతకు పైకి ఎగిరిపోయింది కాని, మరి కిందికి దిగలేదు.

ఇప్పుడు ధనుంజయుని బ్రతుకు ఒంటి పాటు బ్రతుకయింది. దేవుడా అంటూ అతను విచారంతో తన కుటీరానికి పోయి,




ఎప్పటికైనా మళ్ళీ దివ్యగానం వినపడక పోతుందా అనే ఆశతో కనిపెట్టుకొని ఆరు నెలలు గడిపాడు. కాని అతని ఆశలు ఫలించలేదు.

* * *

కడసారి కూతురు తారాకన్య, ఆమెకు పుట్టిన పిల్లవాడు, అనగా తన మనమడూ, కలసి మళ్ళీ తమలోకానికి వచ్చినందుకు నక్షత్రరాజు ఎంతో ఆనందించాడు. తారా కన్య భర్తను స్మరించకుండా ఉన్నట్టు నటించింది. కాని, ఆ పిల్లవాడు మాత్రం అస్తమానం తండ్రికోసం బెంగపెట్టుకొనే వరకు, మంచి చెడ్డలూ కష్ట సుఖాలూ

తెలిసిన నక్షత్రరాజు ఒకరోజున తారా కన్యను పిలిచి, "అమ్మాయీ! పిల్లవాడు తండ్రికోసం బెంగపెట్టుకొన్నాడు. కనుక, నీవు భూలోకానికి పోయి, నీ భర్తను ఇక్కడికి తీసుకువచ్చేయి. అతనుకూడా మనతోపాటు మనలోకంలోనే ఉండి పోవచ్చు" అని అన్నాడు.

ఈ కోరిక తారాకన్యకు ఇంతకుముందే ఉన్నప్పటికీ, భూలోకానికి పోయి మాన వుణ్ణి పెళ్లాడినందుకు తండ్రి ఏమని పోతాడో అనే జంకుతో చెప్పటానికి ఇంత వరకు సాహసించలేకపోయింది. కాని, తండ్రే తనంతట తను ఇప్పుడు అనుమతి తెలిపేసరికి, తారాకన్య, కుమారుణ్ణి వెంట బెట్టుకొని గభాలున భూలోకానికి దిగి వచ్చింది. ఆరునెలల తరువాత ఇప్పుడు మళ్లీ దివ్యగానం వినపడగానే, నృత్య మండపానికి చేరువనే ఉంటూవున్న ధనుంజయుడు ఆకాశంవంక చూచాడు.

ఒకచిన్న చుక్కవంటి ఆకారం అతనికి కనబడింది. అది పెద్దదై గుండ్రముగా కన పడింది. కొంతసేపటికి కిందికి దిగ గానే అది ఒకతట్ట అనే సంగతి స్పష్టమయింది. ఆ తట్టలో తన భార్యా, కొడుకూ కనపడే వరకు ధనుంజయుడు ఆనందంతో పొంగి పోయాడు.

కొన్నాళ్లు భార్యా, కొడుకూ అతని కుటీ రంలో కులాసాగా నివసించిన తరువాత, ముగ్గురూ కలసి వెంటనే నక్షత్రలోకానికి వెళ్ళిపోయారు. అక్కడ ధనుంజయుణ్ణి మామగారు ఎక్కువగా ఆదరించటంచేత అతను ఆలోకంలోనే ఉండిపోయి హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.

అప్పుడప్పుడు ఆ దంపతులిద్దరూ రెండు డేగపిట్టల రూపంలో భూలోకానికి దిగివచ్చి, ఇష్టం వచ్చినంత సేపు తమ కుటీరంచుట్టూ గుండ్రంగా తిరిగి తిరిగి, మళ్లీ నక్షత్రలోకానికి వెళ్లిపోతూ వుంటారు.



## చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

### ఆధారములు

అడ్డము :

1. అరణ్యజంతువు
4. కార్యము
5. దిక్కు
7. బట్టలుతుకువాడు
8. పద్మము
10. పగ
12. సహస్రములు
13. దత్తమండలములు



నిలువు :

1. అడవి
2. నాలుగవ తిథి
3. మునలి
4. దాసి
6. దేహములు
9. చంద్రకాంతి
11. వ్రాయుటకు ఇది కావలెను
12. విశ్వదాభిరామ వినుర—

## రోకటిపాటలు



సూర్యుడూ యిచ్చిన చుక్క మెట్టిల్లు
సువిదరో మా కాళ్లు చుక్కలై మెరసు.
నారాయుడిచ్చినా నల్లబూసల్లు
నాతిరో నా మెళ్లొ నానులై మెరసు.
పరమేశు డిచ్చినా పసుపు కుంకమ్మ
పణతిరో నా నొష్ట పద్మమై మెరసు.

* * *

యిరుసు విరిగిన బండి యింటికే రాదు
మనసు విరిగిన బుద్ధి మరి కట్టుబడదు.
తమలపాకుల కట్ట లెక్కౌట్టరాదు
తమ్ము డన్నమాట తప్పుపట్టరాదు

* * *

రోటినిండా పోసి రోకళ్లు పట్టి
రోటికి మ్రొక్కను లోభితనమేమి ?
రోటికిందపాలు రోటికెక్కసము !
తల్లిలేని బిడ్డ ధరణి కెక్కసము.

* * *

ఉసిరికాయలుతిన్న రుచులేమితెలుసు ?
పసిబిడ్డపెండ్లాడిన బలమేమితెలుసు ?
చెలికత్తె తీపయిన చెరుకు తీపయిన
తల్లిపాలు విషమైన జగమెట్లు మెచ్చు ?

* * *

ఉల్లిపువ్వెంతైన మల్లెపువ్వుకాదు
వేశ్య ఎంతచక్కనిదైన యిల్లాలుకాదు.

సంపాదన : { లక్ష్మినారాయణ, బసవపూర్ణమ్మ




# పిల్లల పెంపకం

## నిద్ర

బిడ్డలకు నిద్ర చాలా ముఖ్యము. ఒకపూట తిండి లేకపోతే ఆరోగ్యం చెడిపోదుకాని, నిద్రవిషయంలో మాత్రం నియమం పాటించకపోతే శరీరానికి చెరుపుచేసితీరుతుంది.

ఏవయసు బిడ్డలకు ఎన్నిగంటల నిద్ర అవుసరమో దిగువ వివరిస్తున్నాను:—

| | | | | |
|---|---|---|---|---|
| పుట్టింది మొదలు | 4 నెలలవరకు | రోజుకి | 20 | గంటలు |
| 4 నెలలు | ,, 7 ,, | ,, | 18 | ,, |
| 7 ,, | ,, 12 ,, | ,, | 17 | ,, |
| 1 సం ॥ | ,, 3 ఏండ్లవరకు | ,, | 16 | ,, |
| 3 ,, | ,, 5 ,, | ,, | 14 | ,, |

బిడ్డకు తల్లి పాలిచ్చేటప్పుడు చేరతీసుకోవటం తప్పితే తక్కిన సమయాలలో వేరు మంచంమీద పడుకోబెట్టాలి. బిడ్డ పడుకొనే పక్క వెచ్చగా ఉండేటట్టు చూడాలి. గాలి తగలకుండా చిన్నదుప్పటి కప్పడం అవసరం. ఎప్పుడుకూడా బిడ్డను ఒకేవేళకు నిద్ర పుచ్చాలి. బిడ్డ నిద్రించే గదిలో దీపం చిన్నదిగా ఉంచాలి.

సామాన్యంగా బిడ్డలను బుజంమీదవేసుకొని జోకొడతారు. అది మంచిదికాదు. ప్రక్కలో వేసిగాని, ఉయ్యాలలో ఊపిగాని నిద్రబుచ్చటం సరిఅయిన పద్ధతి.

మంచినిద్రలో ఉన్నశిశువు ఒక్కొక్కప్పుడు మధ్యలోలేచి పోరుపెట్టడంకద్దు. అటు వంటప్పుడు కారణం ఏమైవుంటుందా అని కనుక్కోకుండా, దిష్టితీయడం మొదలైన ఉపచారాలు జరుపుతూ, మనవాళ్లు బిడ్డపైన విసుక్కొంటారు. ఇది పొరపాటు. కారణం లేకుండా బిడ్డలు ఎప్పుడూ ఏడవరు. కనుక, పైకి కనబడని కడుపునొప్పివంటి బాధ ఏదైనాకలిగిందా అని ఓరిమితోను, నిదానంతోను ఆలోచించి తెలుసుకోవాలి.

నిద్రనుగురించిన మెలుకువలు ఇంకాఎన్నో ఉన్నై.

'మీ పెద్దమ్మ'

1



2



3



4



5



6



7



8



9



పైన ఉన్న తొమ్మిది బొమ్మలూ, అన్నీ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా, నిజానికి అలా లేవు. తొమ్మిదింటిలో రెండు మాత్రమే ఒక్క మాదిరిగా వున్నై. ఆ రెండూ ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.




## నాట్యమాడే బొమ్మలు

ఈ ట్రిక్కు చాలాచిత్రమైనదిన్నీ, ఆశ్చర్యకరమైనదిన్నీ. దీనిని చూచి ప్రతిరోజూ కలకత్తాలో జనం విస్తూపోతూ వుంటారు. అంతెందుకూ! - నామట్టుకి నేనే, కొన్నేళ్ళ కిందట, ఒక వందమందిగల గుంపుతో కలసి ఈ ట్రిక్కు చూస్తూ, అపరిమితంగా ఆశ్చర్యపోయి, వాళ్ళతోపాటు ఉత్సాహం పట్టలేక చప్పట్లి కొట్టాను. సామాన్యంగా బస్తీలలో వీధులవెంట మోళీకట్టే గారడీవాండ్రు సాయంకాలంగాకుండా మిట్టమధ్యాహ్నమే దీనిని చేయగలరు.

దీనికి కారణము ఏమిటంటే, వారికి ఇది వంశపారంపర్యంగా వస్తున్నటివంటి విద్య. వాళ్ళపిల్లలు ఇటువంటి గారడీలను ఉగ్గుపాలతో నేర్చుకొని వుంటారు.

పోతే - ఈ తమాషా, చూపరులకు ఎలా ఆశ్చర్యం కలిగిస్తుందో ఆ కీలకం ఇప్పుడు చెబుతాను.

మోళీవాడు రోడ్డుపక్కన బాసిపెట్టు వేసుకొని కూర్చుంటాడు. ఒక చాపపరచి, దానిపైన కొన్ని ఆటబొమ్మలు పడవేస్తాడు. ఇదే అతను చేయవలసిన ప్రయత్నం, ఇంతే అతడు సంపాదించవలసిన సామగ్రిన్నీ. మోళీవాడు హుషా



రుగా జేజేలు కొడుతూవుండగా ఆ బొమ్మలు లేచి నించుని, చిత్రవిచిత్రంగా నాట్యమాడటానికి ఆరంభిస్తాయి. అవి ఊగుతాయి. నృత్యం చేస్తాయి, అడుగులు వేస్తాయి, ఒకదానినొకటి వింతగా కౌగలించుకుంటాయి. బొమ్మలు ఇన్నిరకాల చేష్టలు చేస్తూ వున్నప్పటికీ, మోళీవాడు వాటిదృష్టే తనకు లేనట్టుగా, అటువేపు తిరిగి నాగస్వరం పాడుతూ వుంటాడు. లేదా, ప్రేక్షకులతో సరదాగా ప్రసంగిస్తూ వుంటాడు. ప్రేక్షకులు ఆ బొమ్మలవేపు తెరచిన రెప్పవాల్చకుండా చూచి ఆశ్చర్యపడతారు, ఆనందిస్తారు.

అయితే — ఇలా బొమ్మలచేత నాట్యమాడించటం చాలా సులువైనపని. గారడీవాండ్రవద్ద ఉండే నల్లటి 'మాయదారం' సహాయంతో ఈపని దిగ్విజయంగా నెరవేర్చవచ్చు. ఈదారం ప్రత్యేకం తయారు చేయబడి వుంటుంది. ఇది కంటికి కనపడనంత సన్నగానూ, నల్లగానూ వుంటుంది. చేతితో తాకినప్పుడు తప్ప, ఈదారం ఉన్నదా లేదా అనేసంగతి మన కంటికి తెలియదు. పట్టపగటివేళ రెండడుగుల దూరంలోకూడా ఈ దారాన్ని చూడలేము.

ఆ మాటకువస్తే - కలకత్తాలోని మోళీవాండ్రు ఇంత వెల కలిగిన ప్రత్యేకపు దారాలను ఉపయోగించరు. పొడవుపాటి తలవెంట్రుకలతో ఈ ట్రిక్కు నిర్వహిస్తారు.



ఇప్పుడు చెప్పిన దారమునుగాని, తలవెంట్రుకనుగాని 2-వ పటంలో చూపిన రీతిగా బొమ్మలలోంచి దోపి, ఒక కొస మెత్తటి తేనెమైనంగల చిన్న పెట్టెకు కట్టి, రెండవకొస గారడివాడు తనకాలి వేలికి కట్టుకోవాలి. కాలిపైన బట్టకప్పి వుంటుందిగా? — కనుక అతను కాలి వేలికి దారంకట్టుకున్న సంగతి బ్రహ్మరుద్రులకుకూడా తెలియదు. కాలివేలికిగాని, చేతివేలికిగాని దారం కట్టుకొని, మోళీవాడు తన ఇష్టంవచ్చినట్టల్లా దారాన్ని కదుపుతూ వుంటే, ఆ కదలికను బట్టి బొమ్మలు ఆడుతూ, నృత్యంచేస్తూవుంటై.

దీనికల్లా ఎడతెగని సాధకం, ట్రిక్కుచేసి చూపటంలో కొంచెంచొరవ,యుక్తి,అవసరం, —వీటివల్లనే మనదేశపు మోళీవాండ్రు, ప్రపంచమంతా ఖ్యాతిపొందుతూవున్నారు.

[ఈ గారడి ట్రిక్కులనుగురించి మీ అభిప్రాయాలూ, మీకుగల సందేహాలూ సరాసరి సర్కారుగారికి వ్రాస్తే, వారు మీకు జవాబిస్తారు. వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి. ఈ మాట జ్ఞాపకం ఉంచుకోండి. వారి అడ్రెను:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.

यह बाजार है।
दोनों तरफ दूकानें हैं।
वहाँ एक आदमी केले बेच रहा है।
एक औरत केले खरीद रही है।
सड़क पर बहुत लोग जा रहे हैं।
बहुत लोग आ रहे हैं।
मोटरें और ट्राम-गाड़ियाँ चल रहीं हैं।

राम बाजार जा रहा है।
रमणी भी जा रही है।
राम एक दूकान पर खड़ा है।
वह एक कलम खरीद रहा है।
रमणी दवात का दाम पूछ रहा है।
दूकानदार कलम दिखा रहा है।
रमणी और राम देख रहे हैं।

साँझ हो रही है।
सूरज डूब रहा है।
रमणी और राम घर लौट रहे हैं।

बाजार = బజారు
दोनों तरफ = ఇరువైపులా
दूकान = దుకాణము
आदमी = మనిషి
केला = అరటికాయ
बेच = అమ్ము
खरीद = కొను
औरत = స్త్రీ
सड़क = రోడ్డు
बहुत = చాలా
लोग = జనులు
सब = అందరు

गाडी = బండి
खडा = నిలబడి
दाम = వెల
पूछ = అడుగు
दूकानदार = దుకాణదారుడు
दिखा = చూపించు
देख = చూచు
साँझ = సాయంత్రము
हो = అగు
सूरज = సూర్యుడు
डूब = మునుగు, అస్తమించు
लौट = తిరిగిపోవు

ఇది తాత్కాలిక వర్తమాన కాలము. అప్పటికప్పుడు జరుగుతున్నదానిని తెలుపుతుంది. ఇందులో కర్త ఏకవచన పుల్లింగమైతే దాతురూపానికి रहा है అనియు. స్త్రీలింగమైతే रही है అనియు, బహువచన పుల్లింగమైతే रहे हैं అనియు, స్త్రీలింగమైతే रही हैं అనియు చేర్చాలి, హిందీలో అకారాంతస్త్రీలింగ శబ్దాలకీ, అకారాంత పులింగ శబ్దాలకీ ఏత్వమిస్తే బహువచన మౌతుంది. ఈకారాంత స్త్రీలింగ శబ్దాలు బహువచనమైతే చివరనున్న ी బదులు इयाँ చేర్చాలి.



ప జి లు ఈ

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 వ | న | 2 చ | ర | 3 ము | |
| 4 ప | ని | | వి | | 5 ది | 6 శ |
| రి | | | తి | | | రీ |
| 7 చా | క | లి | | 8 తా | మ | ర |
| రి | | | 9 వె | | | ము |
| 10 క | 11 సి | | న్నె | | 12 వే | లు |
| | 13 రా | య | ల | సీ | మ | |

జ వా బు

51-వ పేజీలోని చిక్కుబొమ్మలకు జవాబు:

★

3, 5 నెంబర్లు గల బొమ్మలు రెండూ ఒక్కమాదిరివి.

★




ఈ బొమ్మకి దంగులు వెయ్యండి. మీరు రంగులు వేసిన బొమ్మని వచ్చేనెల (డిసెంబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI

